

కావ్యదత్తతాస్వీకర్త

"వాఙ్మయోద్ధారక, కవికులాలంకార"

శ్రీ జవ్వాది లక్ష్మయ్య నాయుడుగారు, ఎమ్. ఎల్. ఏ.

# నాంది

శ్రీదేవి రైదాయి కైదోయిచిగురుల
నొత్తి కన్నుల నద్ది యొఱగు తావు.
దెసల సౌసాయించు తెఱగంటి దొరల హొం
బొమిడికల్ వ్రాలు నబ్బురపుఁ జోటు.
ప్రాఁజదువుల సిగల్ జటలపైఁ గుసుమించు
ఘుమఘుమలన్ గుత్తగొన్న సీమ
దేవ ఋషీశాన భావ సౌధమ్ములఁ
దేజ మొల్కెడి రత్నదీప కళిక.
గగన గంగా మహాదేవి కన్నకూఁతు
రైన శ్రీనాథ దివ్య పాదారవింద
మధువు ప్రసవించు భవ్య వంశ మ్మొకండు
తెలుఁగు సీమ నాలుగు చెఱంగుల వెలుంగు 1

సుగుణాళుల్ సురభీకరించుటను మోజుల్ గుల్కు "జవ్వాది" నా
మ గణేయాభిధనొక్క శాఖ యట శంసా పాత్ర; మాశాఖపై
భగవద్భక్తులు కార్యశూరు లనుకంపాధీన ధీ పాళికిన్
నగలున్ శారదమిత్రముల్ సిరికి సంతానాలు చెల్వొందెడిన్ 2

భయమును భక్తియుం బెనఁచి వైభవముల్ మరియాద లూపుచున్
నయ వినయమ్ములన్ జయ మనారతముం గను శ్రీ "జవాది వెం
కయ దొర" బల్ గభీరుఁ డొడికమ్మగు జీవిత మెన్నుకొన్న వాఁ
డయి ప్రభవించి మించె నట నా పెనుగొండ పురీ లలాలమై. 3

వాని కడుపుఁ బంట గా నిర్వు రుదయించి
రినుఁడు నిందుఁ డట్లు లెసక మెసఁగి
ఒకఁడు శ్రీకి నెమ్మి; యొకఁడు వాణికి సొమ్ము;
వేరుపాటు లేని పెద్దఱికము. 4

అన్న నరసింహ మూర్తిగ
నెన్నిక గన్నాడు. తమ్ముఁడీకృతి పితగా
నున్నాడు. లక్ష్మ యాఖ్యాత
వన్నెయు వాసియును పురిగ వర్తిలు చుండున్. ౫

ఇమ్ముగ దమ్ముడ తానై
యెమ్మెలు దిద్దుచును సన్న యేకత గనఁగా
దమ్ముఁడు "శాసన సభ్యత"
నిమ్ముగ దానై తెలుంగు నేల దొడంగెన్, 6

కవితా రసిక వతంసుఁడు
జవాది లలితునకు నాదు శైలీ ఝురిలో
చవి నెఱిగి మెచ్చు ధీ వై
భవ మలరెన్ నాదు గురుని పరువము కతనన్ 7

తనకు గళ ద్వయసముగా
నెన రీ విద్య త్కవీశ నిర్మాణములన్
ఎన గనని వాని నెమ్మికి
ఋణముం దీర్చెడు యశమ్ము నెటు లిడ గలమో! 8

* * * *

పండువుల్ కన్నుల పండువై యిల్లెల్ల
యలరారుటకు హేతు వాఁడు బిడ్డ.
పౌత్రి దౌహిత్రుతో వాఁకిటఁ జెరలాడ
కులుకు లూఁగుట ముద్దు కూఁతు వల్ల,
జామాత హుందాలు సందడింపఁగ వారి
తహతహ సొగసు లాత్మజ కతాన.
తాను గన్యాదాన ధన్యుఁడై పితరులు
గుతుకమ్ము గనఁ గౌమరితయ కుదురు.

కుందెకట్టులు గుజ్జెనగూటి హొయలు
శ్రావణమ్ముల నోముల సందడింపు
లెల్ల కళ లింటిలో గుబాళింప సొగసు
కడలి యిల్లాట కీ కన్య కారణమ్ము. 9

కవి కాత్మాంబుజ జాత లుండుదు రసంఖ్యల్ కావ్యకన్యల్; ధరా
ధవులున్ మిత్రులు దేవు లా సరస సంతానమ్ము గాంక్షింతు రా
చవికై నాలుక నూటలూరుటను శ్రీజవ్వాది వంశాబ్ధి ను
ద్భవుఁడీ చంద్రుడ యీ మదీయ కృతి సంభావించుఁ గూఁతుం బలెన్ 10

*   *   *   *

అది సారస్వత యుగ్మ దివ్య కలధౌతాహార్య తేజమ్ము; న
య్యది వైయాకర ణాబ్ధి మంధరము; వేదాంతా నుభావా_ క్తము
క్తిద మౌ నిత్య నవీన భవ్య కవితా క్షీరాబ్ధి, పుంభావ శా
రదకున్ తాతకు రామశాస్త్రికి నతుల్ గైసేతు సాష్టాంగముల్. 11

ఉపనిష ద్బుద్ధి "యహోబల పండితీ
య" ధ్వాంతమునకు సహస్ర రశ్మి,
సర్వతోముఖ మనీషా ప్రాభవుఁడు యతి
ప్రాస నిర్మిత మహాభాష్య కర్త.
విద్వ త్కవీశ్వరుల్ వెలయు దామెరవారి
యోలగమ్మున నాడు కాళిదాసు,
శంకరాచార్యుని శైలి పుక్కిట బట్టె;
హనుమ దాశ్వారున కాళవారు.
ఆంధ్ర గీర్వాణ విద్యాలయమ్ము నందు
దెలుగు జీవము పోసిన వెల గలాడు.
ఇహ పరమ్ముల రథ్య చూపించి విడిచె
పుత్రుఁడుగ శిష్యుడుగ "రాము" మోఁకరింతు. 12

సాహితీ వేద శాస్త్రాల సౌందర్యంబు
వెల్లువ లౌ కారపల్లి మాది
గురు ఋణమ్ముసు దీర్చి కొన్నట్టి యవధాను
"లవ్వారి" వారు నా కాంధ్ర మిడిరి
ఉభయ భాషా కవి త్వోదార కేదార
మోదా నుభూతి నా భోజనమ్ము
బ్రహ్మదేవుని రాణి వాణీ మహా దేవి
చిలుకతోపాటు పెంచినది నన్ను
చతు రక్షర గ్రంథ సంధాన మతికంధి
భాష్య కారుదు తర్కపంక్తి గలపె
అమ్మ వాణిగ సిరి నాయనమ్మ గాగ
మామ్మఁ దలపుస నిడుచు సంసార మీది
కులుకు చుండుసు మా తల్లి కొలువు సేయు
భవనములోఁ ద దుద్యాన వనము లందు. 13

జయ నామకము పవిత్రయము సంపాదించు
బోలెడు మాగాణి భూమి మాది
శ్రీనాథ పోతనల్ పీయూషముసఁ బెంచు
నుద్యాన వనము మా కుండె నొకఁడు
మధురలాలస కుల్యా మండువాలో సుందు
గిరికా వరూధినుల్ రేకరింప
తిరుపతి వేంకటేశ్వరులు ప్రవ్వించిన
కలువల రాయంచ కొలను మాది
ఆదిలో ఋషి కోకిల లాని నట్టి
మేడలోఁ గామధేనువు పాఁడి గలదు
లోటు మా కేమి, ముదము కల్లోల సమితి
కొల్లలుగ రేగు వాణి పుట్టిల్లు మాది 14

లాఁగ డాగరి దొరగారి యాగ మూర్తి
నూటిపోసిరి నాదు తంత్రులు శ్రమించి
రామశాస్త్రి వెంకటశాస్త్రి నామధేయ
సాహితీ శాస్త్ర ధనుల కే వాఁగిలింత. 15

బుద్ధికి బృహస్పతిం గేరు "పోలిసెట్టి
రంగనాయక" శ్రీ నాయుఁ డంగరక్ష.
ధన్యత గడింతుఁ బురుషోత్తముఁడు వెలయు
నాంధ్రగీర్వాణ విద్యాలయమ్ము నెంచి. 16

తిరుపతి వేంకటేశ్వరులు వాణికి సమ
ర్పించు కొన్నట్టి కిరీట మొకఁడు
కేం కవీంద్ర మదేభ కేసరి శారదా
దేవికి నిడు రత్నదీప మొకఁడు,
"చెళపిళ్ళ" శతవధానులు తెల్గు మాతకు
సత్కరించిన దివ్య శంఖ మొకఁడు
కంకణ గ్రామమ్ము కవిరాజు కని యిడ్డ
రవ్వల రశన శారద కొరకండు

దేశిక స్వాములుగ నాదు తీర్చి దిద్దె
మీసముల్ దువ్వి నడయాడు దేశికుండు
మావితోట ధీవించె "సమూపసందు"
క్రింద నున్నట్టి వాత పద్యాల శతమ్ము. 17

గురుదేశికగురు గురువులు
గురుగురు గురుమిత్ర సమితి కుల్కించు కళా
తరుణికిఁ "ఘోషక పితగా
మెఱయింప "జవాది" దొరను మేకొనినాఁడన్ 18

శ్రీదేవి సోదరునాదరమ్మును జూపి
తనియుచు నుండు నాతం డితండ.
శారద కేలిలోఁ గిరమ్ము కులుకులఁ
దినుటకై చెవి కోసికొనుట యితఁడ.
అనదలౌ విద్యార్థు లడుగలేమికి నిల్వ
చేతి కెమ్ములు లేని దాత యితఁడ.
జగడాలు పొగయించు సపదారులకు నేని
పై కోర్టు లేని తీర్పరి యితండ.

తనమతి పరోపకార సంధాన కార్య
మగ్నమౌచు ప్రజాసేవ మరగి యుండి
యతిశయోక్తికి దావు లేనట్లు మనెడు
గర్వ దూరుడు; వినయ సంక్రాంతి కలఁడు. 19

నేను సారస్వత సూన మౌదున యేని
తేటి బోటికి మేటి సాటి యతఁడు.
కమ్మని తుమ్మెద కొమ్మ నే నైనచో
నేల కారాదు తాఁ బూల గుత్తి?
నేను నట్టువ పిట్ట నైనచో నతడప్డు
జీవనాబ్దముగ గర్జించు టనదె?
రసము నిండారు పర్జన్యుఁడే యతఁడైన
లేక పోవునె నాకు కేకి సొబగు?

తేటికిం బుష్ప ముండియు దేటు లేక
సూనముల్ తేటి గల్గియు శోభలేక
శారదా చేతనత్వమ్ము సాగకుండ
దంచు నీ కార్యమున కుద్యమించి నాను. 20

ఆంధ్రసీమను గవి శాగ్రగణ్యుల లోనఁ
దనదు తాంబూల మందని బుధుండు.
రాజకీయ జ్ఞాన రమ్య మంత్రుల లోన
దన పూల మాల లందని ఘనుండు.
"కర్మచంద్రుని" పేరి కాంగ్రెసీయుల లోన
దనదు నాతిథ్య మందని గులాము
పరపతి సంఘాల బావుటా కలచోట
దనదు సధ్యక్షత కనని తావు.

లేడు లేడు లేడు లేదను పొగడితల్
ప్రజల చెవులలో నివాస మైన
కన్నునిండు సోయగాడు; కన్యా దాన
భాగ్యమునకు నోచ వలప దటవె ! 21

"దేవ విబుధ సుకవి దీన విద్యార్థి స
జ్జన సుమిత్ర ధర్మ సత్య" పక్ష
పాత నామధేయ బహుభద్ర సేవ నిధా
నముల బెంచు చుండి నా డితండు. 22

మంగళము గూర్చి జీవిత
రంగమ్మున "ముద్దు చెలియలా ! కొనుమీ యీ
సింగారపు లంగా" లన
రంగా రావతడు కృతికి భ్రాతయు చెలఁగెన్. 23

తన మాతృ దేవితో న
గ్రణి "వెంకటరామశాస్త్రి" ప్రాణేశ్వరితో
నన కావ్య సోదరికి దీ
వెన లిచ్చున్. పుణ్యలోక వీధులఁ గృతియై. 24

శ్రీ కృష్ణగీత నాంధ్రీకరించిన కైర
గృతిగొని కృతిపైన పతి యితఁడు.
"జాషువా" మొదలైన శారదా భూషణ
మ్ముల కలంకారు డౌ లలితు డితడు.
ప్రౌఢ ప్రబంధమౌ వైదర్భి పెండ్లి న
చొత్తించి సత్కీర్తి నొడిసిపట్టె.
మిసిమి మించిన యనామిక కావ్యమున కీతఁ
డే యధినాథుడై యెసక మెసఁగె.
"తెలుగురాజ" కృతమ్ము వెలయు దపోభూమి
ననుఁగున కెప్పించె సంకితముగ.

గొప్ప నెచ్చెలి "బుచ్చిలింగప్ప" సుకవి
కమ్మనౌ గౌరవాస్థాన కవియు కండు
అట్టి విన్నాణి పోషకుండై మదీయ
సుతకుఁ బోషక పిత యౌట యతి కుతుకము. 25

పంట వలఁతిని సవ్వించు పండితుండు
నార్య డన్ను; ప్రఫీవలా చార్యులకును
నాయకుడు తమ్ముఁ "దేలూరు" నగరమందు
నెంచి "సెంట్రలుబ్యాంకు" వరించె నిరని. 26

ఆస్తి నాస్తి యైన ఆస్తికత్ సేస్తాల
ప్రస్తరించు వాస్తవంపు టాస్తి;
పస్తు కస్తి గూల్చు వస్తు వీతండని
హస్త మస్త కముఁ బ్రస్తుతింత్రు. 27

తన మూర్తిని శక్తిని స
క్తిని మీఱుచు భారతమున కీర్తి గొన దగన్
మనుమలు ముని మనుమలు హా
యిని గూర్పగ మను నతండు హేవాకమునన్. 28

ప్రాథమిక పాఠశాలలే కాదు మాధ్య
మికము లున్నతముల్ బడుల్ మెఱుఁగు వెట్టి
సరసపురిఁ గళాశాలకై నడుముగట్టి
కష్టపడు వీని దినచర్య గారవింతు 29

*          *          *          *

శత యోజనా యామ జలధి నెవ్వడు దాఁటె
    ననఁగ నెప్పటి కేని హనుమ యొకడె,
శతకంఠ యంతన స్వామి యెవ్వ డనంగ
    రుద్రపుత్రుండె యే రోజునకును,
ఆ నాటికి నేటి కే నాటికిని గూడ
    బ్రహ్మాస్త్ర రోద్ధ యా వాయుసుతుఁడె,
రామ బాణమ్ము బలాపూరుగా నౌట
    యెట సన ముక్కాల మితని కడనె,

రొమ్ముఁ జీల్చి ప్రభుం జూపు నెమ్మెలాడు
హనుమ సర్వ సమర్థుడం చాత్మ నెంచి
రమె కాతని వరుగా వరించి తెచ్చి
కృతిని దత్తత నాప్తున కిచ్చుచుంటి 30

నా రచించిన తన పోషణమున సున్న
"సౌరభేయిని" కృతిగా నొసంగి నట్టి
దానశౌండీరు గీర్తి కాంతా రిరంసు
"మూర్తి రాజును" మెచ్చి శ్రీ కార్తికేయు
"టోలు" రఘు నిచ్చినట్టి ప్రభుండు హనుమ, 31

కాళిదా సిచ్చె నిల్వు టద్దాల మేడ
పసిడి మేల్కట్లు రత్నాలు బాజు లుమియు
జాలరుల్ కూర్చి వైద్యుత మ్మేలఁ దగిన
పొన్పు సవరించి తనుభవింపంగ రండు. 32

పసిడి రత్నాలు వైద్యుత ప్రాభవములు
గుహ దయా వీక్షణమ్మున గుదురుకొనును

మశక సమితి మత్కుణ కుటుంబమ్ము లెల్ల
నావి యని క్షమియింప వందన శతమ్ము 33

అలరుం గైదువు కేలి కీల్బొమ లసూర్యంపశ్య లౌ నన్య క
న్యల ఘోషా ధరియింప కొంద్రి నిది పంచారించుచున్ కీర్తి వె
న్నెల లార్జించును నాప్త పోషకుల కంతే కాదు శ్రీ పార్వతీ
లలితుం డెప్పుడు లోన నుంచుకొని కైలాసాన నర్తించెడిన్. 34

పింగళి గురూత్తములయు దీవెనల మహిమ
వెంపరాల మహాకవి ప్రేమ ఫలము
మధునపంతుల వారి కమ్మని మనస్సు
ననుభవించిన కావ్య కన్యకు శుభమ్ము. 35

* * * *

శ్రీ గౌరీ జలజాసన ప్రణయినీ శృంగార భా వాబ్ధి స
ద్భోగారూఢము, సర్వ సృష్టిగత సంపూర్ణా ధికారమ్ములో
భాగస్వామ్యము, మూర్తిమ త్త్రితయ మీ వాగ్దేవి సంసారపున్
జాగీర్దారు "జవాది" వంశమణి లక్ష్మయ్యం గటాక్షించుతన్. 36

వీరావేశము విచ్చుకత్తిగమి జళ్పింపుల్ విజృంభింపగా
గారా ల్బారి తెలుంగు శత్రువుల పాగాల్ కోసి శత్రుత్వపుం
గోరల్ తీసిన జాతిలో వెలిసి నిగ్గుల్ తేర వాగ్దేవి నో
రూరం బోషణ సేయు నేరకు శతాయుర్భాగ్య మర్థించెదన్ 37

## షష్ఠ్యంతములు

ధాత్రీ జాతా హ్లాద చ
రిత్రునకున్, మంత్రవ ద్వరిష్ఠున కిలలోఁ
గుత్రచి దత్రస్తునకున్
సత్రీకృత హృదయునకు, సనాతంకునకున్. 38

స్కంధ స్థ క్రవ్యా త్పరి
పంథునకున్, కోటి సూర్య భాసికి, నరి ధా

ట్స్కంధావారపు గంధికి
మంధసునకున్, సమస్త మాయేశునకున్ 39

నిష్ప్రత్యూహ ప్రక్రియ
దుష్ప్రేక్ష్య యోధనములు దుర్ధర్ష రుతుల్
దుష్ప్రాప్య దివ్య తేజము
పుష్పించిన దేవతావిభూత్తంసునకున్ 40

సాష్టాంగ వందన శత సహస్ర పురస్సరంబుగానా రచించు గల్యాణ కావ్యమునకు గథా క్రమం బెట్టిదనిన. 41

హనుమా ! క్రవ్యా ద్ధసనా
ఖనిక బకాయిత నఖాగ్ర కాంతి విభాసీ !
చనువున సంబాళింతును
వినుమా ! మన మాతృదేవి పెండిలి సొగసుల్. 42

లోక కల్యాణ శోభలు చౌకళింప
నోంకృతిన్ భక్తతతిఁ బిల్చుచున్న వారు.
దంపతుల నాశ్రయించు నద్వైత పాఠ
పాఠనమ్మున కాది దంపతులు వారు. 43

ప్రేమ మననేమి ? దానికి బీజ మేమి ?
దాని పుష్పాల ఘుమఘుమ లాను టేమి ?
దాని మధురత దాని సౌందర్య ఫణితు
లెట్టు లాస్వాద్యములు ! దాని కేరు దొరలు ? 44

——

కొండవిల్లు వాని పెండిలి పోషింప
పెద్ద కొండ పతి లభించి నపుడు
కొండపల్లె వాని పెండిలి నచ్చొత్త
కొండపల్లె పడుచు కుదురు టరుదె ! 45



# కళ్యాణ కావ్యము

## పూర్వరంగము



శ్రీరామ కార్య చరితా!
వాలాగ్ర దహోంత సంక్షుణ్ణావానాస్రప! సీ
తా లలనాన్వేషణ శా
స్త్రాలోడిత భక్తిభావ! హనుమా! జేజే! 1

శ్రీ మహేశు జటాజూట శిఖరమెక్కి
జాబిలి హిమాని యందు జ్యోత్స్నా ప్రవాహ
మాదటన్ గ్రుమ్మరించు మహానగమ్ము
ఋషులకును వేల్పులకు విహరించు మేడ. 2

ప్రాక్ప్రతీచీ సముద్రాల వరకు దాసి
యిలకుఁ గొలగట్టి గాఁన సూచింపఁ బడియె
తారకల పైకి పెరిగిన తీరుఁ బట్టి
గోళ సమితికిఁ గొలబద్ద యేల కాదో! 3

రత్నసానుని చెలిమిచే రాణకెక్కి
నా నగాధిప మౌళి పెండ్లాడినాఁడు.
పితరులకు మానసిక పుత్రి సతని ప్రాకృ
తిక విభూతికిఁ దగిన మేనకను నెమ్మి. 4

కలధౌతాచలదీప్తితో బసిఁడి తెక్కల్ విప్పి రాజిల్లి సం
ధ్యలకున్ మేటి సుతారముల్ కురియు మైనాకున్ సునాశీరు బా
హుల వజ్రాహతి లక్ష్యపెట్టని యదృష్టాకారు శ్రీ నాగక
న్యల పాలిండ్ల కవోష్ణ సౌఖ్యభుజి మేనాదేవి కాంచెన్ సుతున్. 5





తెల్లని ముఖమ్ము. క్రిందుగా నల్లరేఖ.
ఎఱ్ఱ చిచ్చుబ కన్ను రంజించు నుదుట
పులికళాసము పచ్చఁగా మొల నటింప
రంగు రంగుల మెఱయుఁ గైలాస భాసి. 6

పెద్దపెద్ద కల్లోలాలు వెల్లి విరిసి
అట్టహాస ప్రభా ప్రవాహమ్ము లొలసి,
చంద్రికలు కాసి పైనుండి శాంతి పఱుప
చిచ్చు కన్మూఁతమై సదా శివుఁడు వెలుఁగు. 7

అతలమునకును నక్షత్ర హర్మ్యములకు
నడుమగా నెంత దూరమున్నది యెఱుంగ.
నాఁటికిని నేఁటికిని మధ్య నాటుకొన్న
కాల మింతని గణియింపఁగాదు, కాని, 8

పృథువు పాలనలోన పృథివి పాలను మంచు
కొండ దూడగ త్రాగి కులుకుటాయె,
పరమేష్ఠి ఘోర తపస్సుకై తారకా
సురునకు వరము లిచ్చుటయు నాయె

సుతను దా మోహింప నూన మేయఁగ నవ్వ
యించు విఘ్నాని శపించు టాయె,
త్రిస్సప్త కృత్వః ప్రదీప్త తేజుఁడు పర
శ్వధమూర్తి తండ్రి సంభవము నాఁడె,
చట్టుపల్ చాఁచి డయనించి చదల కెగిరి
కొండలున్ పల్లకిల్ కొట్టుచుండు టాయె.
ఆ సతీదేవి యోగాగ్ని నాహుతియయి
మానినీత్వమునకు నుసి యైన నాఁడు. 9

ఈశానుండు విపక్ష దక్ష మఖ బంహిష్ఠారి, ప్రాణేశ్వరీ
నాశప్రాప్త వియోగ ఘోర దవ కాంతారాంతరాంత ర్మిళ
త్ప్రశాంతర్వశుఁడై సమాధి నడిఁ జింతన్ ద్రిమ్మంగ, సౌందర్య
వారాశిన్ శ్రీ హిమవన్నగాధిపుని కైలాసాగ్ర పీఠిం గనెన్. 10

పాలసంద్రము పొంగు వారించు మౌళి పైఁ
జందమామయు మహాసుందరుండు,
క్షీరాబ్ధి సహధర్మ చారిణి శిరముపై
సురనది గంగమ్మ సుందరాంగి,
జటలు సింగారించు సరసుఁడు తెల్ల వా
సుకియు గడుంగడు సోయగాఁడు,
తను "పసలే" తెల్పు. దానిపైని నలందు
కొను భస్మ మత్యంత కోమలమ్ము,
వెండికొండ శిరస్సుపై నుండ దగిన
యేడుగడ యంచు స్వాగత మిచ్చి యతిథి
పూజల నొనర్చి తృప్తిగా మోఁకరించె
నా నగాధిప మౌళి శ్రీ మేనఁ గూడి. 11

సాత్వికంబైన మహిత వర్చస్సు గనెనో!
సఖ సతీదేవి నుసియాట జాలి గనెనో!
పరమ శివుఁడు నష్టైశ్వర్యవంతుఁ డనియొ!
హరున కోలగల మిడె తుషారాద్రి విభుఁడు. 12

## కవిరాజ విరాజితము

తళతళలాడెడి తెల్లని పేరులు ఘగఘగ లాడెడి సర్పములన్
మిలమిల లాడెడి నల్లని కంఠము మే కొను సంజల నవ్వులనున్
పెళపెళ లాడెడి నెట్టని నేత్రము పెద్ద జటల్ పెన వైచిన శ్రీ
కళకళ లాడెడి గోధుమ వర్ణముగాంచి, వరించెఁ బదద్రి శివున్. 13

జగదాధార పరోపకార ధిషణా సర్వస్వ బాధాసి, యీ
నగరాజిచ్చిన స్వాగతాన కెవి యైనన్ స్వార్థ మిందుండు నో,
భగవంతుండను భక్తియో! అతిథి యన్ భావమ్మొ, తన్మొందె హా
యిగ, చిత్రమ్మగు కాల గర్భమున నేమేమేమి దాఁకొన్నవో. 14

* * *

## హై మ వ తి

భర్తను నెదిర్చి వెడలిన పరువు సమయఁ
బిత్రు కృత వమాన మెడఁదను రేఁచి లేఁప
బతిఁ గనఁగ మోము చెల్లక సతి నశించి
మగుడ సర్వజ్ఞుఁ గొల్చు ప్రేమము చిగుర్ప. 15

ప్రాణపతి కొండడండఁ దపస్సు గనియొ!
పసిఁడి ఱెక్కల మైనాకు డెసఁగె కాన
వాని కొక ముద్దు చెలియలై వఱలు కొఱకొ!
వెలిసె సతి మేనకా గర్భఫలము గాఁగ. 16

ఆర్యులను నార్యు లెపుడు ఘనానుమేయ
మైన ప్రారంభమునకు నయ్యాలు గదయ్య!
లోకమాత సతీదేవిలోన వెలయు
భావ గాంభీర్య మెవరు పోల్పంగఁ గలరు. 17

అతఁడు చరాచర ప్రకృతి నంతను మోయు బలిష్ఠ సృష్టి. దే
వతలకు జీవితమ్ము నిడు పండుపొలమ్మతఁ డట్టి దివ్యుఁడే
పితయగు భాగ్యముం గనెడు వేడుక తీరగ, దాను మేనకా
సుతగ నవతార మెత్తెను, వసుంధర పుణ్య మదెంతదో కదా! 18

మలయ వాయువు తెల్లెడ నలుముకొనియె
దేవతల శంఖ నాదాలు దెసల బలిసె
పూలవానయుఁ బైనుండి జాలువాఱె
ఆశయుఁ జిగిర్చె, జగదంబ యవతరింప. 19

ఇది మైనాకుని చెల్లెలేకద. మఱేమీ యింత యార్భాటమై
నది యౌరా! ఒక యాడుబిడ్డయె కదా! నానా సుఘోన్నేయ సం
పద లూఁగాడెనె నేఁడిలన్ దశ దిశా భాగాల, నేమో యిదే
చదలం దెచ్చెడి యే యుపప్లవము నేఁచం బుట్టెనో యీ గిరిన్. 20

దేవతలు కూడ చొక్కి మోదించినారె!
పృథివిపై రాక్షసాళి "పేట్రేఁగు" నపుడు
వారి నణగార్చు శక్తి సంభవముగాఁగ
నెల్లరకు సంతసమ్ము మఱేమి వలయు. 21

పృథివి మెఱసెడి నా యాడుబిడ్డ కతన
నా తుషారాద్రి ముదము మర్యాద మిగులు
మేర మీఱిన యట్లుబ్బి యూరె. నామె
యంతు లేనంత కాంతి రవ్వంత గాంచి. 22

ఎందులేని పరాకాష్ఠ నంది స్రష్ట
యింత సౌందర్యరాశి సృష్టించినాడె.
దీనికిం దగ్గ పురుషు గుర్తింపఁ బితకు
శక్తి చాలదు. సృష్టించు స్రష్ట కేమొ ! 23

హద్దులేని లోకాతీత హైమదీప్తి
కార్య సౌందర్యమే సరిహద్దు గాన
తగిన యల్లు గవేషింప, దగిన యట్టి
శ్రీ నగాధిపు దూరదృష్టికి నమోస్తు. 24

**మాలిని**

జవ్వని రువ్వెడి నవ్వులె పువ్వులు
చాఁపెడి చూపులె కోపులుగా
చివ్వన దవ్వుల పల్కెడి పల్కులు
చిల్కల పల్కుల కుల్కులుగా
న వ్వని మవ్వపు రవ్వల బువ్వల
యాటలు. సాటికి దాఁటినవై
నివ్వెర కెవ్వన బువ్వగ, నవ్వని
నివ్వటిలెన్ నెల జవ్వనమున్. 25

"అజుఁడు తనన్ సృజించు పరమాత్మను మున్నిడి యెన్ని వత్సరాల్
భజన యొనర్చి యుండు నొకో ! భర్తను నీమెకు దగ్గ సౌష్ఠవాల్
సృజన యొనర్పు" నంచు వగచెన్ తన మేనకతో, ధరా ప్రజల్
నిజముగ నెంత యోర్తురో కలిన్, తమ బిడ్డకుఁ దగ్గ వానికై. 26

అన్నిటం దగ్గ మగని నుత్పన్నుఁ జేయ
లేని సర్వేశుఁ డెట్టు లాలిని సృజించు.
లోకమున నెల్ల భారము లాకళించు
నా నియామకుఁడే సమాధాన కర్త. 27

మొదల సిద్ధాంతములు లేని పూర్వపక్ష
ములు సృజింతురె ! గురుదేవ మూర్తు లెందు,
శ్రీయు వాణియు నతిలోక సృష్టి యయ్యు
కొఱఁత లేనప్డు. గౌరికి కఱవె మగఁడు. 28

పొంగి వచ్చెడి యౌవనాంబురుహ సుధకు
స్వాగతాహ్వాన మట్లు విద్య లవి యెల్ల
చనువునం జేరుకొనె వినివినిన యంత
మునుపు సర్వజ్ఞులోఁ బఠింపినవి యెల్ల. 29

గంగావాహిని రాజహంసలు శరత్కాలమ్ములో వోతె, స
ర్వాంగీణమ్మగు పూర్వ జన్మగత లావణ్యమ్ముతోడన్ జగ
న్మాంగళ్యమ్ములు దివ్యవిద్యలు తమంతం దామె కై సేసి యా
సంగీతప్రియ యద్రిరా ట్సుతకు నిచ్చల్ కూర్చు సింగారముల్. 30

తాతలు దేవతలు జగ
న్మాతకు, తనతండ్రి భారత ప్రభుఁడగు మా
యీ తల్లి వల్ల భారత
జాతికి దేవతలకుం బొసంగును వియ్యాల్. 31

భువనాతీత మపూర్వ
మ్మవనీధర రాట్కుమారి యందున తత్ప్ర
త్యవయవ గత లవ లవనుత
నవనవ మగు నవకమొకటి నాటెను మెఱపై 32

వీడు కోలిచ్చి పంపించె గుజ్జెన గూటి
సరసన కా నెడా జవ్వనమ్ము
స్వస్తి పఠింపించె జాహ్నవీ సైకతా
యామ కేళులకు ద ద్యౌవనమ్ము

భరతవాక్యము పాడె సురుచిర కందుక
క్రీడ కా ముద్దు లొల్కెడి వయస్సు
సెలవిచ్చి పంపించె చెలికత్తియల మధ్య
బొమ్మ పెండ్లిండ్ల కా కొమ్మ వయసు.
అంగవల్లికి సహజమైనట్టి సొమ్ము
పంచబాణుని యాఱవ బాణ మపుర!
కైపు గల్గించు మద్యము గాని రసము
యౌవనము వాణితో నామె కంకురించె. 33

## దేవర్షి శివతపస్సు

కలఁడు గదా! పురాణములం గాంచలి నెచ్చెలి వైరిసుండు, స
వ్వలి కథ లివ్వలన్ వినిచి వైచును. నివ్వలి గాథ లవ్వలన్
తలఁచును తందనాల జడదారి. నెఱా భజనా తురుండునున్
కలహము విందు త్రేంచుచు జగమ్ములలో నటయాడు వాడునున్. 34

దివి వీణా నినవాన నా జగడపున్ దేవర్షి వేంచేయుచో
నవురౌ డాలు తళుక్కుమన్నది యవశ్యాయాద్రిపై నొక్క నా
డవురా! యంచు హఠాత్తుగా నిలిచె. గన్వాసెగనిగ్యమ్ము దా
వివశుండై మిఱు మిట్లు గొల్పు సుషమన్ వీక్షించె దిగ్భ్రాంతిమై. 35

కొండ మేఘములోఁ దళుక్కున నటించు
మెఱపుఁ దీవఁ బరీక్షించె సురతపస్వి
మూఁడు కాలమ్ము లాతని ముక్కు కొసఁ ద
గుల్కొని తపించు దృష్టిని పల్కరింప. 36

సుర వాహినీ జటా జూటుఁడు నిలువెల్ల
దాసోహ మను జగన్మాత యామె
మృత్యుంజయస్వామి మేనిలో సాఁబాలు
పారితోషికముగాఁ బరిణయించు

వ్యోమకేశుని తనూ రామణీయకమునకుఁ
గామనీయక కళాకలిత యీమె
సంజల నటరాజు చౌకళించెడు నట్టి
హాసాల కీమె యేకైక పత్ని

తియ్యవిలుకాని మంత్రోపదేశములకు
శంకరస్వామి కీమె యాచార్యురాలు.
ఓ నగాధిప! ఆయాస మొందకయ్య!
పరమశివుఁడు జామాతయౌ భాగ్యమబ్బు. 37

సృష్టి తలక్రిందు లైనను, చిచ్చురన్ను
శివుడు మండించినను, నీ సుశీల కభవు
స్వత్వమందు భాగస్వామినీత్వ మబ్బు.
భవున కారాధ్య దేవిగా పరిఢవిల్లు." 38

అని యూఁది తిరోహితుఁడై
చనె నా దేవర్షి కొండ సానువు వెలిగా
మనసును బిగించుకొని పిత
గొనకొని సమయమ్ము కాచికొని కూర్చుండెన్ 39

కన్నె పిత యౌచు నల్లుని కడకు నేఁగి
"యీవు నా కన్యకన్ వరియింపు" మనుటొ:
"ఈ కుమారిక నిన్ను వరించె" ననుటొ!
తోఁపఁ లేదాయె మేనకా దీపకునకు. 40

వరుఁడే మామను కన్య నిమ్మనుచు సంప్రార్థించు నానాఁడు భూ
ధరరా జెట్టులు పిల్ల నిత్తు నని యొద్దంజేరి ప్రార్థించుటో!
హరుఁడీ నాఁడిట ముక్కుమూసికొని యాత్మాధీనుఁడై యుండి సుం
దరి తండ్రిన్ బతిమాలుటో! యన నసందర్భమ్ము లీ యూహముల్. 41

నాఁడు స్వాగత మిచ్చి యున్నాఁడు కానఁ
జనవు సేసికొనం దగుఁ దనకుఁ దానె.
“విధము చెడి వేడుచో నవ్వి వేయునేమొ!
అనుచుఁ దనలోనఁ దానె యుయ్యాల లూఁగె. 42

ఒకనాఁడు బొండుమల్లికల గుత్తులు పూజ
కీ సుతచేత నంపించు వాఁడు.
ఒకనాఁడు రంగవల్లికలు దీర్పఁగ శూలి
వేదిక దరికి నంపించుఁ దండ్రి.
పులితోలు దుప్పటీ దులిపి శుభ్రముచేసి
యారవేయఁగఁ బంపు నామె నొకట.
త త్కమండమువెల్ల ధౌతమ్ము గావించి
పిలిచినఁ బలుక నంపించు సుతను.

వినయ భయ భక్తి సంభ్రమాల్ పెనఁగొనంగ
నొసపరి విభూతి నందింప నుంచు నచట
జలము దర్భాసనమ్ములు సంతరింప
ననుఁగుఁ గూఁతును బుత్తెంచు నద్రిరాజు. 43

విభుని వెన్నెల తన శ్రమ వీడు కొలుప
నేమఱని జాగరూకత నీశుదరిని
చెలుల నిచ్చి శుశ్రూషింపఁ జేర్చె సుతను
అతని మేధకు గలదె మర్యాద సుంత. 44

చుట్టునం బురణించు గస్తూరి సురభి.
గంగయట దేవదారు మొక్కలను దడుపు.
కిన్నరుల్ మంద్రముగ గానమెన్న నచటి
చరియ నెసలారుఁ గృత్తివాస స్సమాధి. 45

ప్రమథ గణములు సురపొన్న సుమములాని
మణిశిలం బూసి ఘూర్జచర్మాలు దాల్చి
ఆ శిలాజి న్మయ శిలాత లాంచలముల
ఉపనిష ద్గోష్ఠిఁ గెరలి కూర్చుందు రెపుడు. 46

నందికేశుఁడు డెక్కలు క్రింద తన్ని
మంచుగడ్డలు త్రవ్వి గర్వించి యార్చు
గవయ మృగములు సకలి కంగారుపడఁగ
బొబ్బరించు "ఖణి" ల్లన ముమురుబంకె. 47

నిర్వికల్ప సమాధి లోఁ, బర్వి మునుఁగు
నట్టి కర్మంది కేల వయ్యాలి సేవ!
చేతిలో మల్లెగుత్తి వాసించు సపుడు
తేటి చూదని ధీరుఁడే ధీరుఁ డనిన. 48

ప్రమథగణాలు దూరముగఁ బర్విత నిత్యము నందికేశుఁడా
సమయము నెల్ల గాచికొని శాంతికిఁ బుష్టినొసఁగ, శూలి సం
భ్రమములు వాయ నా చరియ పైఁ నెది కోరియొ దేని జూచియో
కమిలి తపించెడిన్ సకలకామ్యము లీ నధికారి యయ్యునున్ 49

దేవ దేవాధిదేవ దేదీప్యమాన
దేవత పరాత్పరుండును కేవలుండు.
శ్రీ సదాశివ మూర్తి ప్రార్థించునట్టి
దేవుఁ డెట్టిఁడొ. వాని యర్థించు టేమొ! 50

## సు ర ని వే ద న ము

"స్థూలాయ కఠినాయ సూక్ష్మాయ లఘవే ద్ర
వస్వరూపాయ తుభ్యం నమోఽస్తు
కార్యాయ గురవే చ కారణరూపాయ
ధ్యేయాయ తే భవతే నమో స్తు

భోజ్యాయ హవ్యాయ భోక్త్రే నిరీశాయ
జ్ఞానాయ హోత్రేచ తే నమోస్తు
ధ్యాత్రే స్వతంత్రవేద్యాయ వేదిత్రే చ
పరమేశ్వరాయ తుభ్యం నమోస్తు.

నిర్వికారాయ పురుషాయ నిర్మలాయ
ప్రణవ రూపాయ మోక్ష ఫల ప్రదాయ
సచ్చిదానంద రూపాయ శాశ్వతాయ
నిత్యరూప మహాజ్ఞానినే నమోస్తు. 51

ఆది నొక్కండవై యలరి భాగింపఁగా
మూఁడైన నీకు మా మోఁకరింపు
నీరేయి ప్రళయమ్ము నిలయమ్ము. నీ పవల్
సృష్టి మేల్కొల్పు, జేజేలు నీకు.
సృష్టి సౌందర్య మాశించి స్త్రీపుంస రూ
పాల్ ధరించిన నీకు ప్రణతిశతము
పర పరాత్పరుఁడవై బ్రహ్మకు బ్రహ్మవౌ
ఓ దేవదేవ! నమోస్తు నీకు

జలమునందు నీబీజమ్ము సవదరించి
యీ చరాచర మెల్ల సృజించి మించు
నిన్ను మించిన విజ్ఞాన నిధులు లేర!
అందుకొనుమయ్య! సాష్టాంగ వందనములు. 52

శ్రీదేవి ముద్దుబిడ్డవు,
వేదవ్యాసుఁడవు. సర్వబీజాధార
స్వాదుత వెలసెడి సృష్టికి
నీదే కద యాజమాన్య నియతి మహాత్మా! 53

మిథ్యా జగమున వైదిక
రథ్యలు పొలివోవ నీక రక్షించి భువిన్
విధ్యుక్తమ్ముగ నడుపుచు
పథ్యముగూర్చుటయు నీవ. పరమతపస్వీ ! 54

జిలిబిలి పలుకుల చిలుకల
కొలికికి గిలిగింతపెట్టి కులికించెడి నీ
పొలిమేర లేని కళలకు
నలువా ! వెలగట్టు మేటినలువ గలఁడా ! 55

జగము సృష్టింపఁగా సర్వాధికారివి.
నీ యధికారి కాన్పింపఁ డెచట.
జగము లన్నిటిని నాశనము చేయుట నీవ.
నీవు మాత్రమ్ము నశింప వెపుడు
ప్రథమ సృష్టికిఁగూడఁ బ్ర ప్రథము డీవు
నీకంటె మున్నెది నెగడలేద
స్వస్వరూపము స్వయంశక్తిచే నీయంద
తెలియుదు విద్ది ప్రత్యేక మహిమ

మీ వధిష్ఠానమై సృజియించు కొనుట
నీకు నీవేకదా ! నిన్ను నీవ లయము
నేసికొంటయు నీయంద, చి న్మయాత్మ !
చిత్ర చిత్రాతి చిత్రచరిత్ర సతులు." 56

అని బిడౌజసు మున్నిడికొని నుతించె
రాజరాజును యాదసాంప్రభుఁడు సర్వ
కర్మసాక్షియు శ్రీ యమధర్మరాజు
గంధవాహుఁడు రుద్రు లేకముగ వచ్చి. 57

అవ్వి యష్ట శ్రవోరంధ్ర యానములను
శ్రీ పరంజ్యోతి మేల్కొల్పె ఱెప్పవిప్పి.
సత్యలోకములో సరస్వతి విభుండు
కనుఁగొనం డిట్లు నున్న దిక్పతుల నొకట. 58

శారదా పతి నయనాల జాలువాఱు
దృక్ప్రసారమ్ముతో నష్ట దిక్పతులును
ముఖము లంతింత లౌచు నుప్పొంగినారు.
బాలభానున కెదుటి పద్మాలు వోలె. 59

మాడిపోయిన ముఖముల గూడిమాడి
డిల్లవోయిన మదులతోఁ దెల్లవోయి
జీవకళ మాసి తనను దర్శింప వచ్చు
నొడయులం జూచి నివ్వెర పడియె నజుఁడు. 60

తాన యాకస్మికముగ నా దశదిశాధి
కారి దైన్యము దన మనసారఁ గాంచి
వెకిలి దేవిరిగొట్టు వాలకము లాని
కులిశపతి నిట్లు తహతహ కుశల మడిగె. 61

"వృత్రాసురుని జీల్చి వెలుఁగు నేలు వజీరు
వజ్రాయుధము దీప్తి బం`బడియె.
గారుడమంత్రమ్ము కట్టిన త్రాఁచుగా
వరుణపాశము తేజు సురిఁగిపోయె.
పెనుగొమ్మ నఱికిన వృక్షమై గదలేక
ధనపతి బాహువు వినుచు ముప్పు.
దక్షిణ దిక్స్వామి దండమేమో కాని
ఆఱిన కొఱవిగా మాఱె నదిగొ!

బొమ్మలై ద్వాదశార్కులు సొమ్మసిల్లి
మంచు ముద్దలుగా నేల మూలినారొ!
ఏడువాయువు లేరొకో! ఎగుమదిగుడు
వీచికలతోడ నుక్కిరిబిక్కి రగుట. 62

వంగిన జటాళిలో వ్రేలబడి కృశించు
చందిరుని రేఖలో జాలి జాలువారి
హుంకృతులు లేక రుద్రులు పంకిలురయి
దిక్కుమాలిన మొగములు తేర్చిరేల? 63

ఊర్జిత శక్తియుక్తులు. మహోన్నత దైవిక తైజస ప్రభా
మార్జిత ఘోరరాక్షసులు. మంగళదాయకులున్. తపోమహా
ద్గర్జిత పాపకర్మతులఁ దర్జన భర్జనసేసి యేలు నో
నిర్జరులార! మీ యురవణింపుల కెచ్చట డాలు డిందెనో! 64

థోరణి రూపు మాసి సటు తోఁచెడి దేవతలార! మీ యధీ
కారము లొక్కతూరి యణఁగారినవా! నెఱమూఁత మంచులోఁ
నారక వైరి దేల! బహుదారుణ మారణ హోమహేతు ర
క్షో రిపురాజి మీ కెచట కక్కసమై మిము గాల్పదుం గదా! 65

భువనాతీత మహత్తర ప్రతిభ సంభోజాక్ష సాహాయ్య సం
భవ దత్యద్భుత సాంపరాయిక కళా పారీణతాజాను బా
హువులన్ పెత్తసమార్చి లోకమున కాయూ రక్షణల్ కూర్చు మీ
జవ జీవాలకు ముప్పు మూఁడదుకదా సర్వత్ర లోకఘ్నులన్. 66

పాలనము మీది. సృష్టించు పంతు నాది.
నా యొనర్చెడి దెది చెపుఁడా!" యనంగ
ఒక్కసారిగ వేయికం డ్లొరగించి
ప్రాచ్య దిక్పతి ప్రాజ్య వాక్పతిని లేపె. 67

అల్లనం బిల్లగాలి కుయ్యాల లూఁగు
కమలముల శోభతో వేయి కన్నులూఁప
భవుని ముఖ్యా తిముఖ్య నేత్రమగు గురుఁడు
దొరకు మనవి చేసెను తమిన్ దోయిలించి. 68

“సర్వాంతర్యామి జగ
ద్నిర్వహుఁడవు, సర్వకథల ధోరణుల లవాం
తర్వేదివి, రక్కసుఁడు మహా
గర్వోష్ఠి యొకండు సృష్టిఁగాల్చుచు నుండెన్. 69

ఒకఁడుద్దండుఁడు గండరించెను, చిరాయు ర్భాగ్య దాతా! భవ
న్నికటామోఘ సహస్ర దారుణ వరానీకమ్ము స్వీయాద్భుతై
హిక వాంఛా ఫల సిద్ధిదాయక తపోఽహీన క్రియన్ పొంది, కు
త్తుక కడ్డమ్మయి తార్కొనెన్, హరి బలాదూరయ్యె త చ్ఛక్తికిన్. 70

ఇతఁడే "తారక" మారకాసురుఁడు, నీదే త ద్వరానీక పు
ష్టి,తపస్సే యతిఘోర ఫక్కిని పొనర్చెంగాక. కానిండు. దే
వతలన్ చిత్రవధల్ పొనర్చి ధర కొంపంటించి వేధించు శా
శ్వత దుర్ధర్ష వరమ్ము లిచ్చితివి, దేవా! వాఁడు నీ కే మగున్. 71

రక్కసున్ మొక్కలించి ఊరక జగాన
విడిచినావు విలాసగా, పిలుకుమార్చు
పిడుగును సృజింప మఱచినా వేమి తాత!
గిట్ట వలదా! జగత్తులో పుట్టు వెల్ల. 72

జనకస్రష్ట! పితామహా! మన శచీసాధ్వీ మహాలక్ష్మలన్
కనక క్ష్మాధర వింధ్య భూధర గుహా గర్భమ్ములన్ దాఁచినా
మనఁగా నన్య సుపర్వ భామ లోక లెక్కా! వీని దౌర్జన్య దృ
ష్టి నిశాతార్చికి, వాఁడు మా సురల కంటెన్ మీఁకుఁ జుట్టమ్మఁటే! 73

వాని బావులలోని పద్మాలు వికసింపఁ
గాఁదగ్గ యెండయే కాయవలయు.
పక్షభేదము లేక వాని లోఁగిట సదా
నిండు జాబిల్లి నిల్చుండ వలయు,
కుసుమ తస్కరుఁడంచుఁ గుమ్మించు నని గాలి
విసనకఱ్ఱకు మించి వీవఁడచట
అటు సర్వకాల సర్వావస్థలం దాఱు
ఋతువు లాడుచును సేవింపవలయు.
కల్పవృక్షాల నగలు కాన్కలిడి వ్రజి
యితని దయ కోసరము నిరీక్షించు కొనును.
కౌస్తుభము వంటి భూషణాల్ కాన్కవెట్టి
ప్రాఁకులాడును వీనికై రత్నరాశి. 74

ఆలిగొను తెల్గుమీఱి దిక్పాలకులను
పృథు వరమ్ముల లాహిరీ బిమ్మిటి మెయి;
తాదృశా తతాయిని బట్టి త్రంపివెట్ట
నింతకన్నను కలుచ లింకేమి వలయు 75

వాసుకి మొదల్ గలట్టి దివ్య ప్రభువులు
ప్రడగలందు మాణిక్యాలు ప్రజ్వలింప
జీవ రత్నాల ధగధగల్ చిమ్మ వాని
వాఁకిటన్ రాత్రు లెల్ల నిల్బడఁగ వలయు 76

నందనమ్ము బృందారక సుందరీ ల
లామలకు ప్రాణపదము కదా! మహాత్మ!
అంపముల్ బండకత్తులు రాచి రాచి
నందన వనమ్ము నఱకు చున్నాఁడతండు. 77

చెఱల్ఁ బెట్టిన తెఱగంటి తెఱవ లచట
నడికిరే వెక్కుచున్ వాని పడక టింటి
గుబ్బు రొంద మధ్య నెగయూర్పు కొనలపదును
గాఁగ వీతురు. కన్నీరు కార్తు రపుడె. 78

రత్నసానుని శిఖరమ్ము లుత్పాటించి
క్రీడా చలాలుగాఁ గెరలువాఁడు
గంగ దిగ్గజ మద కలుషమై తద్వాపి
పసిఁడి పద్మమ్ముల పంట యయ్యె
జయముపైఁ బుట్టె డాసను గూర్చు విష్ణు చ
క్రమ్ము తత్కంఠహారముగ మాఱె
ప్రళయ మేఘాలపై వాని వే దండముల్
రేఁచు వప్ర క్రీడ రేఁ బవళ్ళు
ద్యో పతికి "సహో" నోటిలో దుమ్ముకొట్టి
అతఁడె హవ్యము మెక్కు మాయావిమాయి
చెనఁటియై ప్రుచ్చిలించె నుచ్చై శ్శ్రవమును
బిక్కనన్ భీతిమై సురల్ నక్కి రెటనొ ! 79

రేయిపగలుగ నెండచంద్రికయుఁ గాగ,
రాజును గులాముగా బంటు ప్రభుఁడు గాఁగ
తాఱుమార్చేయు నీ దొరతనము వాఁడు
పట్టపగ్గాలు లేనట్లు బరిదెగించి. 80

పోతరించిన భూతమై మూర్తి బిగిచి
యార్చు నాతఁడు; త దనుగ్రహమ్ము కొఱకు
నిట్లు దిక్పాలు రెంత సేవింత్రుగాక
పెటుకురక్కసి తన బుద్ధి విడువఁడాయె. 81

సన్నిపాతమ్మునన్ మహౌషధము లట్లు
మాయమౌ సర్వమీ యాకతాయిపట్లు
కడిఁది పడవాలు సురల కొక్కని సృజించి
రక్కసుని ద్రుంప ద్రెంప బ్రార్థనము తాత!" 82

అని వాక్పతి సాలించిన
వెనువెంటనె తాతగారు వినిపించి రిటుల్
ఘనుఁ డుటిమిన యా వెను వెం
టనె వర్షము పడిసటుల్ మిటారము కురిసెన్. 83

"శాంతింప న్వనిఁ గొంతకాలము తురాషా డాదు లేనింక ని
శ్చింతన్ సంతస మందు కాల మది వచ్చెన్. దాఁపురించెన్ సుదు
ర్దాంతున్ రక్కసు ద్రక్కలించెడు మహారౌద్రమ్ము. నావల్ల మీ
సంతాపమ్ము లణంగ రా దయిన నాశాసింతు వేదోక్తులన్. 84

నేనే పెంచిన రక్షకుం డతని నేనే సంపఁ గా రాద. యెం
దేనిం బెంచిన కాలకూట తరు నేనిం దానె ఖండింప లే
దే! నాఁడాతఁడిదే వర మ్మడిగి సిద్ధిం బొందె. చల్లారె స
ద్దానన్ వాని జగ ద్వినాశన తపో దావాగ్ని సర్వస్వమున్ 85

యోధుం డెవ్వఁడు నోర్వఁడా పటు మహాయోధాతి యోధున్ జగ
ద్బాధా ధ్వంసక ధూర్జటి ప్రళయ రౌద్ర వ్యక్తిమ ద్భుజ ధా
రా ధౌరేయ మహావతార మొకఁడా రక్షః క్షుదా మాపక
ప్రాధాన్యా ద్భుతశక్తి యుక్తుఁడగు. మీరల్ పొందు. సాధింపుఁడా! 86

చూపుల్ మీటి తమస్సు దాఁటిన పరంజ్యోతిః ప్రకాశమ్ము కా
దా! పారమ్య విహీన తైజస కళా ధావళ్య పుంజమ్ము త
ద్రూప వ్యాపృత రోదసీ గత లస ద్రోచి ర్మహైశ్వర్య ము
ద్దీపింపం గన లే, నెఱుంగ నది. నేనే కాదు వెన్నుండునున్. 87

వర్షాకాల సమీర మంబుదము నాహ్వానించు నట్లిందు నా
కర్షించుం గద, లోహదండము నయస్కాంత మ్మటుల్, దివ్య డు
ర్ధర్షోదార సమాధి మగ్నుఁడగు నుగ్ర స్వామినే పార్వతీ
హర్షోత్ఫుల్ల విలోచనా త్మరుచి వ ర్షాకార సౌందర్యముల్. 88

మనల కిద్ది వినాకరించిన మఱొక్క
యాశ లేదాయె; యత్నింపు డందు కొఱకు;
నన్ను జలమును వాని నా నాతి తక్క
నితరు లెవ్వరు మమ్ము భరింప లేర. 89

స్ఫటిక భాసి ముక్కంటి యొక్కటి సుతుండు
పౌఁజు దళవాయిగా వాని ప్రాణ మార్చి
చెఱ సుర పురంధ్రులకు జటల్ చిక్కుఁ దీసి
వీర్య సంపదతో విజృంభింప గలఁడు." 90

ధాత యిట్లని తాఁ దిరోధాన మందె.
క్షణము పోరాద సంయమీశ్వరుల. కజుని
సెలవు శిరసావహించి లేచిరి; దిశాధి
నాథు లెల్లరు. గార్య సంధాన పరత. 91

ముజ్జగమ్ముల దొర లోక మోహనుఁడగు
పుష్ప ధన్వుని వే తలపోసికొనియె
తలఁచు కొంటయె తడవుగా దరిసె మరుఁడు
సకల లోకాల కది శుభ శకున మటవె. 92

అప్సరో భ్రూకుటి నతకరించెడి కోటి
తేటి శింజానమ్ము దీటు కొల్పె,
నెయ్యుని బుజమూని, తియ్యమామిడి మొగ్గ
లలరారు తూణీరఁ మందె కేలు,

రతి కంకణము లొత్తి రక్తి కట్టిన బాహు
దండమా నిల్వెత్తు ధనువు దాల్చె,
"కృష్ణకృష్ణా" యంచు కేకిసల్ తొడి రామ
చిలుకలు రణభేరి చిల్కరించె.

చంద్రసచివుఁడు జ్యోత్స్నతో సందడింప
పింపిసలు గూసె మలయాద్రి పిల్లగాలి
లోఁగగించెను ఘుమఘుమ. లేలుకొనుచు
చెఱకువిల్కాఁడు తన దొర దరిసి మ్రొక్కె. 93



అటుని రాజ్యమ్ములో నాదిత్య దేఁవుడే
యారోగ్యమునకు సర్వాధికారి.
ఒక చరాచర పరాయుః పేటికకును తా
ళమ్ము తాతయ్య కేలనె మెలంగె.
పట్టాభిషిక్తుఁడై పరిఢవిల్లును కదా !
కైవల్య మిడఁగ శ్రీకాంతుఁడొకఁడె.
ఆది భిషఁడె సమస్తైశ్వర్య సంధాన
సింహాసనమున నాసీనుఁడగుట.

మహి ఫలింపఁ బెత్తనదారు మబ్బు రౌతు
ప్రణయరసమను జిగురుతో రంగరించి
దంపతి పదార్థహార్ద మద్వైతపఱచు
నున్నతోద్యోగి ఆ సుమాయుధ మహాస్వి. 94



## సేవ్యసేవకులు

"రా రమ్మా! లలనా కటాక్ష శిత నారా చాధిపా! నీ యధీ
కార ప్రాభవ తప్త కాంచన శలాకా రత్న సింహాసన
మ్మి రంజిల్లెడి దిద్ది, నీకయి నిరీక్షించున్, అధిష్ఠించుమీ
మారా!" యంచు మహేంద్రుఁడాదరము ప్రేమన్ గ్రుచ్చి రెందరిన్. 95

దేవతల వైపు ప్రసరించు దృష్టి తిగిచి
వెసన దాటుగ దనవైపు విసరివైచు
వేయి కన్నుల సొగసు కుబ్బిన వచస్వి
పుష్పచాపుఁడు దొరఁగాంచి మోఁకరించి. 96

"ఓ లోకత్రయ పాలకా! కరుణ నాహూతుండ నైనాను, నా
కీ లోకమ్ములలో నసాధ్య మను మాటే లేదు, కర్తవ్య వాం
ఛా లక్ష్యమ్మును గుర్తు దెచ్చికొని యాజ్ఞాపించి యాశీర్వచో
జాలమ్మం గురిపించి దాస మద దృష్టమ్మెల్లఁ బండింపుడా? 97

ముల్లోకమ్ముల నెవ్వఁ డేనియుఁ సరే మున్ముందు నీ ముందు
జిల్లంగా వలెఁ బ్రాంజలించుకొని పుంజీభూత సౌందర్య రు
క్కల్లోలాయిత దీప్తిమై నెవతె ని న్నైసేయఁగా నెంతువో!
కొల్లఁగొట్ట గలాడ నామెమతి, నాకుం జెప్పి దీవింపుఁడా. 98

భవ దుద్యోగము గోరి ఘోరముగఁ గ్రవ్యాదుం డెవం డేని యీ
భువనాల్కాల్చు తపస్సుమై వెలిసెనా! మోమోట మేలోక్కొ! ఆ
చవుటిన్ వెంటనే నాఁచికోఁగలుగు పుష్ప మ్మొందు సంధింతు నే
లవముం గ్లేశము లేద నాకు, నవలా లావణ్య రాశీ పతిన్. 99

ధూర్తుఁ డెవ్వండు ముక్తుండు కాఁగోరెనా!
నష్టటమంతు నా నరుని తపసు
శుక్ర శిష్యుండేని వక్రించెనా! తమి
నంగ లార్పంగఁజేయంగలాడ
దనకుఁ దానౌచుఁ గ్రొత్తడి యైననున్ నిన్ను
గాఁగిలింపఁగఁ జేయఁగలఁడు వీఁడు
చుప్పనాతితనమ్ము చూలాలుగా నిన్ను
జూఁకించువానికి శోక మిడుదు.

హరహరా! యంచు నెంత మహా సమాధి
నిష్ఠమున్న గరిష్ఠునిన్ భ్రష్టుఁజేతు,
ఒక మహాప్రవాహ మ్మేటి యొడ్డు నట్లు
గూల్తు నీకయి యెంత ముంగోపినైన. 100

వజ్ర మొక మూలగా భద్రపఱపు మయ్య
ఒక వసంతుఁడు తోడుగా నున్నఁ జాలు,
పూలతో రుద్రునేని బెంబేలు పఱతు,
నితర యోధుల శక్తి లేక్కేమిఁ నాకు. 101

కంచుకౌపీన మేర్చి శరించు హరుని
కంట చిచ్చున్ననున్ సరే, కంఠమందు
హాలహల కీల లున్న సరే! లతాంగి
యమ్ము సంధించి నీ జాగిలమ్ము నేతు. 102

హరి జగన్మోహిని యై వెట్టె మీకింత
బోనమ్ము, నన్ను నమ్ముకొని గాదె,
వాణి గుణాళింపు లాను దేవయ్యకు
నాటకట్టును నా సహాయ మేది,

అతిలోక సౌందర్య మాని మహేశుఁడే
హరిఁ దగుల్కొంట నా చెఱకు కతన
నాఁడహల్యా దేవి నైగనిగ్యమ్ము మీ
రా స్వదించుటకు నే నాత్మ కాద,
హరి హర హిరణ్యగర్భుల కన్న మిన్న
యౌ బలిష్ఠుం డెవండు నిన్నదిమినాఁడు,
కైవసమ్ము వాఁడుత్తర క్షణము నీకు,
నాజ్ఞమై పూఁదలింపు మయ్యా! బిడౌజ! 103

అధిపతికి సేవకుల్ ప్రాణమైన నొడ్డి
యాపదల కడ్డుచోఁ జరితార్థులగుట
బంటులకు ముక్తి ప్రభుభక్తి పరతనుండు
ప్రభు మహాశయు ఋణము దీర్పంగ వశమె! 104



## ఆజ్ఞ

"నిర్వక్రా ద్భుత శక్తి యుక్తుఁడవ. యేణీలోచనా పాంగ సా
త్సర్వజ్ఞుం డతి సాహసుండవును: విశ్వాసమ్ము నీయూర్పు. గం
ధర్వాదుల్ నను నీవిభుండనుచు స్తోత్రాల్ సేయ గర్వింతుఁ గిం
కుర్వాణీకృత శత్రుమండలునిన్ గుర్తించి నారీ సురల్. 105

జంభ జృంభణ దంభ సంరంభమార్చు
హాలాయల దంభోళి, నీవు, నాకున్న సరకు.
మునుల దరి మొక్కవోవు దంభోళి ధార,
యెల్ల సాధింప నాకు నీవే శరమ్ము. 106

సాక్షా దష్ట దిగీశు లర్థు లిట యాచ్ఞాదైన్య సంతాపన
ప్రక్షుభ్య న్మతులైరి, కార్య మిది యావత్సృష్టి సంక్షేమ కృ
న్నిక్షేపమ్ము త్వ దేక సాధ్య మని వాణీజాని వాక్రుచ్చె. దా
ర్ఢ్యేక్షు స్ఫార కృషత్క మిమ్ము; తెగనూఱింతుస్ ఘృతాచీ కటిన్. 107

సకల దేవత లిందు యాచకులు నీకు;
ముజ్జగమ్ముల దీకార్యమును; సరాళ
కుసుమ శర సాధ్యముస్; హింసగొడవ లేని
సమర విజయ మ్మిదెంత యాశ్చర్య మప్ప. 108

భక్తియు యుక్తియు రక్తియు
శక్తియు నాసక్తి నీ కసాధారణముల్
ముక్తిప్రమదా మధు సం
సిక్తులు నీ మిత్రు లనుచు చెల్లు టెఱుఁగుదున్. 109

పూ లకోరీలు ముక్కంటి మోహరించి
పార్వతీ దాసునిగ మార్ప వలయు నిపుడు
పార్వతీ పరమేశ్వర ప్రణయఫలము
రాక్షసా ధ్యక్ష సర్వ మారణ చణమ్ము. 110

పనులు సాధింప నన్నించు వాఁడ వనుచు
నీ పస నెఱుంగుదును. కానసే స్మరించి
నాఁడనిన్. భూమి మోయుచుంటను గ్రహించి
శేషునే తల్పముగ హరి చేరి నాఁడు. 111

శివుని నైనను లొంగ దీసెద నటంచు
చెప్పనేచెప్పి తిది మాకు గొప్ప శుభము.
రక్కసుల కక్కసమ్ము తీర్పంగ సురలు
గువ్వకరికొని నిను కోరుకొంట యిదియ 112

పూల బాణాల శిఖిశిఖా కీల లందు
పరసమాధి శిలాయిత హరమనస్సు
వెన్నపూసగఁ గరఁగించివేసి దాన
పడయవలె మాకుఁ జిచ్చుబి పిడుగు నొకఁడు. 113

"హర పూజా రతి సర్వమంగళ యవశ్యాయాద్రిపై నున్న దా
తరుణీరత్నము తక్క వేఱొకతె లేదయ్యెం ద్రిలోకాస నా
హరబీజమ్ము వహింపఁగాఁ దగిన" దంచా స్రష్ట వాక్రుచ్చె; వే
గిరమే విల్లు పరిష్కరింపు; మిది నీకే చెల్లు సాధింపఁగన్. 114

ఇది గిరిజా తపస్విని వహించెడు కార్యమ. యైనగాని నీ
పదును వినా, యసాధ్యము నభావ్యము సుమ్మిది నిశ్చయమ్ముగా.
ఉదకము లేక బీజ మొకఁ డున్ననె యంకుర ముద్భవిల్లునా!
మదన! యెడంద కేల యనుమానము కేగిర మేగి రమ్మిఁకన్. 115

అనలునకు సాయ మొనరింప ననిల దేవు
నెవ్వ రెడ్డేనియున్ హెచ్చరింప వలెనె
ఒక్క రెవ్వరు బతిమాల కుండఁగానె
అల వసంతుఁడు నీకు సహాయుఁ" డనఁగఁ. 116

"చిత్తము చిత్త"మంచు దన చిత్తముతో శిరసావహించి యె
గ్గెత్తి "మహాప్రసాదము సరే" నెలవంచు ప్రయాణమౌ వెసన్
హత్తిన ప్రేమహెచ్చరికకై తెలి యేన్గును తట్టునట్టి కే
లెత్తి చపేట మార్చె హరి. యామరు వీఁపున బుజ్జవమ్ముగా. 117

మఘవ దమోఘ వాక్యములు మై పుదపింపఁగ నాతఁడిచ్చు సా
రఘ చషకమ్ము నందుకొని త్రాగె నతం డొక రెండు గ్రుక్కలా
జఘనవతీ లలామల పసందు వసంతుని సోయగమ్ము మే
టి ఘుమఘుమల్ వెలార్చెను 'పటీర కుటీరములా' మిటారముల్. 118

"చచ్చిననున్ సరే" యని వసంతుఁడు ప్రాణసఖుండు తోడుగా
నెచ్చెలి గుండెలో నెదియొ నెవ్వగ గ్రుంగుడు బెంగటిల్లి న
ట్లుచ్చిన బద్ధయట్లు రతియుం బయన మ్మయి కూడ ర్యాగ నా
చిచ్చుఱకంటి తాపు దరిఁ జేరె; రతీశుఁ డధిజ్య టంకృతిన్. 119



## సమాశ్రయము

తపమునకు దారుణారి. కందర్ప దర్ప
సర్వ సాధకుఁడైన వసంతరాజు
మలయ వాయువు చెలిమిమైఁ బులకరించి
విశ్వరూప ముబ్బించి యావిర్భవించె. 120

స్త్రీపాద తాడనమే లేక పుష్పించె
నల యశోకము మొదలంట విరిసి
నెలవంక మోదుగుల్ చెలఁగెఁ గట్టెఱ్ఱఁగా
లతకన్నియల నఖ క్షతము లట్లు

బ్రహ్మఁ దిట్టించు నిర్గంధమ్ములై కొండ
గోఁగులు నెఱ్ఱ రంగుల నటించె
తేటి కాటుకఁ దీర్చి; తిలకాస దిద్దఁ గి
సాల యోష్ఠమును వసంతి లక్ష్మి
చిగురుటాకు తెక్కులు నిగనిగలు గురియ
పూలశరములతో మావి డాలువాఱె
చెఱకువిల్కాని పేరందుఁ జెక్కినట్లు
బంధ రాశరముల్ విజృంభణము సలిపె. 121

పుప్పొడి పడి కన్ను విప్పకే పెంటితో
నెదురు గాలికిఁ బరువెత్తె లేడి
చిగురుమామిడి జీర శ్రీ కోకిలయ్యచేఁ
బొలయల్కకత్తెలఁ బిలిచె మరుఁడు
సిద్ధ నవోఢల చెక్కుటద్దాలపై
మకరికా లతలు చెమర్పఁ దొడఁగె
పువ్వులఁ జిఱుగాలి, నవ్వి సయ్యాటించి
యివమేది దెసల స్తరింపఁ దొడఁగె
పనస పుష్పాల ఘుమఘుమల్ పల్లవించి
రసిక రసనల నగలించి యెసక మెసఁగె
ఇటు హఠా త్సిద్ధమై విరాజిల్లు చుండ
వెలయు విడ్డూరముల ఋషుల్ వెఱఁగు పడిరి 122

కలఁకంబాఱెడు నెమ్మనమ్ములను జిక్కం బట్టు కొన్నా రెటో
బలవంతమ్ముగ శంకరాశ్రమ మునుల్; భార్యా ద్వితీయుండుగా
లలనాచాపుఁ డధిజ్య ధన్వుఁడయి, చేరంగానె స్త్రీపుంస జా
తుల కన్యోన్యము ప్రేమ బైటపడి హద్దుల్ మీఱ సాఁగెన్ వనిన్. 123

**విజయమంగళరగడ**

కొదమతేటి త్రాగసాఁగె, కోమలాంగి తోడగూడి
కొని సుధా మరంద మింత కుసుమ పాత్రమందు వ్రాలి,
కొదరి లేడి తన నెఱంత గోఁకసాఁగె ప్రేమ రెచ్చి
కొమ్ముకొసలు తగులఁగానె కొమ్మ కన్ను కొసలు వ్రాలె,
సొగసి యేన్గు గున్న యొకతె సోలి ప్రాణ పతికిఁ దమ్మి
సుమము ఘుమఘుమించు నీరు జోగియిచ్చెఁ బుక్కిలించి
సగము కొఱికి మగువ కొఱకు సరసమైన తమ్మితూఁడు
చక్రవాక మొక్కఁడిచ్చి సంతసింపఁ జేసి మించె. 124

**లయగ్రాహి**

కమ్మనగు గానము ర సమ్ముసకు మైమఱచి
బొమ్మచెలు వ మ్మగుచుఁ గిమ్మనక వించున్
సొమ్మసిలి చెమ్మటలు చిమ్మి శిధి లమ్మయిన
యమ్మకరి కా లతలు గ్రమ్ముకొనఁగా మ
ద్యమ్ము తెగఁ ద్రాగగను బొమ్మలు నటించు దన
కొమ్మకొక కింపురుషుఁ డమ్ము బలు సుద్దుల్
రమ్మనుచు ముద్దులిడి పొమ్మనుచు నవ్వులిడి
యమ్మగువ గువ్వసుర తమ్మునకు లాగన్. 125

**కమల విలసితము**

సొగసగు గుచములు సుమముల గుత్తుల్
చిగురులు పెదవులు చెలిమిని గుల్కన్
మగువలు లతికలు మరులిడు చెట్లన్
బుగబుగఁ గవుఁగిటఁ బొదువఁగ సాగెన్ 126

## స్రగ్విణి

అచ్చరల్ గానముల్ హాసముల్ విన్ననున్
చిచ్చుక న్నిష్ఠకే చేటు లే దింతయున్
అచ్చమౌ బుద్ధి కే యంత విఘ్నమ్ములున్
మచ్చ మాయింపఁగా నాఁచికో లే వెటన్ 127

## మత్తకోకిలము

నందికేశుఁడు తర్జనిం దన నాసపై నిడి డాకర
మ్మందు బంగరు బెత్త మూఁపుచు నా లతా గృహ దేహళిన్
క్రిందు గుమ్మము నెక్కి శంకర కింకరాళి గణమ్ములన్
ముందు వెచ్చఁగ హెచ్చరించుచు పొంగ వద్దన సాఁగెడిన్. 128

## సరసిజము

నందీశానుం డుం దనకేలన్
ననుపుల నణఁపఁగ నమితుల యగుచున్
వందారుల్గా నందఱు భృత్యుల్
భయపడి గజగజ వణఁకిరి వనిలో
అందందే నిం దిందిర వృక్షా
లరచెడి పులుఁగులు నణఁగెను త్రుటిలో
క్రందుల్ సందుల్ చిందుల జంతుల్
కదలక శమముగ కఱుదుగ మెలఁగెన్ 129

నందీశ్వర శాసనమున
నిందిందిర పక్షి జంతు వృక్షాదికముల్
చిందుల్ చెందవు. క్రందుల్
పొందవు. వన మెల్ల నొక్క బొమ్మగ మాఱెన్. 130

### స్వాగతము

అందఱున్ పయన మందున శుక్రున్
ముందు పెట్టుకొని పోని విధానన్
సుందరీ నిశిత శూలుఁడు ముందా
నంది దృష్టిఁబడ నాశన మెంచెన్ 131

సందియాన నిఱు సందుల ప్రక్కన్
పొంది క్రందు సురపొన్నల లోనన్,
ఇందు శేఖరు వసించిన తావున్
చెందె నందిని నిషేధము సేఁతన్. 132

### ఉత్సాహ

రే వెలుంగు తాల్పు పుండరీక చర్మ పీఠికన్
చావు బార నున్న పుష్ప సాయకునకు నా దెసన్
దేవదారు మొదట నరుగు దిమ్మపై మహాతప
శ్శ్రీ విభాసి మూఁడు కనుల సిద్ధుఁడై కనంబడెన్. 133

గీసి నట్లు నిల్పెఁ దనువు పెద్ద విచ్చు పద్మమున్
వేసి నట్లు తొడలమధ్య విప్పెఁ గేలుదోయి వీ
రాసనమున నంసయుగము నదిమి నప్పి ధ్యానమున్
చేసికొనుచు నీలగళుఁడు చేవమైఁ గనంబడెన్. 134

### పంచచామరము

జటా కలాపమున్ ముడించె సర్పరాజుతో నట
న్నటఁ జ్జపాక్ష మాల చెవికి నప్పె రెండు పేట లా
కుటీర మందు కంఠకాంతి గ్రుచ్చుకొన్న తెమ్మెరల్
పటాణిచర్మ మూని వహ్నిఫాలుఁడే కనంబడెన్. 135

## మంజుభాషిణి

తన ప్రాణ మెల్ల జడతన్ మునుంగఁగా
చిను కేమి లేని ఘనులెన్నుతో, సలల్
కనరాని వార్థివలె, గాలిలేని తా
వునఁ గాఁగడాకు సరి మోక్ష రాజటన్. 136

## మంగళమహాశ్రీ

మొక్కలము మెక్కినవి, ముక్కలయి కిక్కురని
పొక్కనివి భ్రూకుటి మయమ్ముల్
దిక్కులకు రెక్కొనవు, దీధితికిఁ జిక్కనివి,
తెక్కుగల యుక్కుగను గ్రుడ్లన్,
దృక్కులవి ముక్కుకొన కెక్కినవి, చక్కనివి
యెక్కటివి లక్కిమికి నిక్కల్,
గ్రుక్కుఁ గను తెక్కలవి సొక్కినవి, జక్కవల
చుక్కెదురు దారి కపు డచ్చో. 137

## భాస్కరవిలసితము

ఆ ముని తపమున కచ్చెరు వౌన,
ట్లంబర మగిలెడి సెగ లుదయించెన్
తామర నవకపు దారము కంపెన్
నన్నని ననుపగు తల నెలవంకన్
ప్రాముచుఁ గమలజు రంధ్రము వెంటన్
పైఁబడి యది నెలసిరి వడలిం న్
కాముని కనుగవ బడ్డవి యిట్లా
ఖండపరశు నెటి తపమున మంటల్. 138

## ఉత్సాహ

తనువు లోని నవక మూఁచి దారి పూడ్చి సిద్ధుఁడై
మనసు నెల్ల హృదయ పీఠి ముల్చుచున్ సమాధి మై
తనది నేసికొనుచు శాశ్వతమ్ముగా సుఖించు నా
తనకులోని తన్నుగాంచు ధన్యుఁడే కనంబడెన్. 139

ఆరు బూరు మంచు నాలీఢపాదుఁడై
పూలనారి కర్ణమునకు లాగి,
అలరువిల్తుఁడా "త్రియంబక" స్వామిని
చేరినాఁడు చావు జేసఁ గలఁడు. 140

మనసుతోననైన మూససింపఁగ వీలు
గాని ఫాలనేత్రు నాని చూచె.
సరము పట్టువీడి కర ధను శ్శరములు
జాఱుచెఱుఁగఁ డయ్యె చక్కనయ్య. 141

## అంగజాస్త్రము

శీవియు చేవల్ దీల్పడు తా నా
వీవన యో నా వెల్గు నవోషన్
సావాసుల్ సఖి జాడ నుండ స
ద్భావం జూచెను బర్వతాత్మజన్. 142

పూవు లశోకాల్ ముగ్గిన కెంపుల్
వావిలి ముక్తా ప్రాభవ భూషల్
కోవల్ బంగరు కొండగోఁగులన్
దేవిన్ జూచెను తియ్య బాణముల్. 143

కొంచెము వంచెన్ కొమ్మగుళుచ్ఛాల్
సంచు "గులాబీ" శాటిధరించెన్
అంచుల్ మించినదై పువుగుత్తుల్
వంచన్ సాఁగెడి వల్లిని చూచెన్. 144

### శ్రీరమణము

ఇంచుశరుండా యింకొక మౌర్విన్
పొంచిక దాఁచిన పోలిక తోఁపన్
మించుఁ బిఱుందుల మే బవడంపుం
గాం చెగయించెడి గౌరిని గాంచెన్. 145

### క్రౌంచపదము

విచ్చిన పద్మాల్ గ్రుచ్చిన యూర్పుల్
పెనురతి బెనుపఁగ, బిరబిర తేటుల్
మచ్చిక దొండన్ మెచ్చని కెంపై
మలఁచిన పెదవిని మఱిమఱి వ్రాలన్
అచ్చలమై మే ల్పచ్చని కేలన్
హరువగు గమలము నటునిటు లూఁపన్
హెచ్చు బెడంగుల్ హెచ్చిలఁ జూచెన్
గిరగిర కనుఁగవ హిమగిరి కన్యన్. 146

### మణిగణనికరము

రతికిని బిడియము ప్రతిలవ మొలయన్
అతి లలితత నవయువముల మెఱయన్
కుతుకిత గనుఁగొని కుసుమ శరుఁడు నా
జిత సకలుని శివుఁ జెనఁకఁగ దొడఁగెన్. 147

పూఁబోఁడి చేరు కొన్నది
కాఁబోయెడి ప్రాణనాథు గడపను శివుఁడున్
లోఁబడు నాత్మ జ్యోతిని
లోఁబఱచుక చూచి యోగరూఢత లేచెన్. 148

మెల్లగ పంచ ప్రాణాల్
వేల్ల ద్గతి సడల విప్పె వీరాసన మా
తెల్లదొర శేషు పడగలు
నిల్లిగ్గులు వాఱి భూమి నెటులో మోసెన్. 149

మనవి నేసెను నంది సమస్కరించి
"ప్రభుని సేవించుకొన గౌరి వచ్చిన"దని
ప్రభుని సమ్మతి గనుబొమ్మ వలన నెఱిఁగి
నందికేశుఁ డాపెను దొరముందు నిలిపె. 150

జోహారుల్ కయి సేయుచున్ చివురు విచ్చుం బూల గుత్తుల్ సఖుల్
మాహేశానుని పాద మూలముల జల్లం జొచ్చి రత్యాదృతిన్
సౌహిత్యమ్మున గౌరి, ముంగురులలో జాల్వారు బంగారు పూల్,
సాహిత్యమ్మున గర్ణ పల్లవములున్ జాఱంగ మోఁకారిలెన్. 151

హరుఁ "డనన్య భాజం పతి మాప్నుహి" యని
సర్వమంగళ కాశీస్సు నిర్వచించె.
వెలయుఁగాదె మహానుభావుల వచస్సు
లెట్టి గండమ్ములను కటాఱించి యైన. 152

శ్రీకమనీయలసద్దివ్యకారా! విబుధ కవి కులాలంకార
ప్రాకట చిరాయు రారోగ్యాకల నా వశవిభావ! హనుమా! జేజే! 153

ప రా భూ త పాం స్ని

# ద్వితీయాశ్వాసము

శ్రీ కల్యాణా స్పద బాహూ ! కైవల్యేశ ! వాఙ్మయోద్ధారకులన్
సాఁకుచుఁ దేజుం గూర్చెడి; లోకారాధ్యా మహేశ్వరుని గారామా ! 1

చిలుక పటాణి రౌ తదను చేరిక జీరుచు చిచ్చుదూఁకు నా
శలభము వోలె గౌరిదెస జూపిన దృష్టికిఁ జంద్రమౌళి, చూ
డ్కులు గుఱిచేసి విల్లుదెసఁ బొంచి గుణమ్మును సాఁగదీసి ని
ష్ఠలబడి మాటిమాటికిని టంకృతి సేయఁదొడంగె తేఁకువన్. 2

మెల్లఁగ నెట్టుడా ల్కురము మీఁదికి మేవడి సాఁచి భక్తి నా
తల్లి సురాపగన్ వెలయు తామరపూసల తావళమ్ము నా
తెల్ల వటారిదేవు గుఱుతించి సమర్పణసేసె; నెండ శో
షిల్లి పసందుగా తళతళించెడి మాలికమీఁది మక్కువన్. 3

పదయత స్వీకరించుటకు శంక రుఁడా వలకేలు సాఁపఁగా
"నద నదియే" యటంచు గుణమందు లగింపఁగ మోహనాస్త్రమున్
మదనుఁడు పైకి లాగి కొనినాఁడు నిషంగమునుండి యిప్పుడా
పదును నతిక్రమింప మఱి వమ్మగునో సకల ప్రయత్నముల్. 4

హరుఁడౌ గావుత చందమామ గను దుగ్ధాబ్ధిన్ విడంబించుచున్
గెరటాల్ కేకిసలాడ ధైర్యరమ లోఁ గించిత్తు లోపింప నా
సరసీజానన దొండపండుపెదవిన్ సౌందర్య వారాశి మో
ము రమం బ్రేముడిఁ బుల్కుఁబుల్కురని యామోదింపసాగెన్ దమిన్. 5

పులుకుంబుల్కునఁ జంద్రమౌళి తనమోముంజూడ గుర్తించి సి
గ్గిలి రోమాంచితయై జగాకడిమి రు గ్రేఖల్ పిసాళించు మం

గళ దేవీ సువిలాస నేత్రములఁ గంగారెత్తి యాకేకరో
త్కళికల్ చిమ్ముచు మోము నడ్డముగఁ జొక్కం ద్రిప్పె సింగారియై. 6

పులకాంకూరిత గాత్రుఁడై లలన చూపుం గోపు తూపుల్ ప్రసా
రిలి శృంగారిత భావముల్ పఱుప సర్వేశానుఁ డాలోననే
కలఁతంబాఱిన యింద్రియ క్రియలు చిక్కంబట్టు కొన్నాడెటో
బలవంతమ్మున నా జితేంద్రియుఁ డటన్ స్వాధీనుఁడై మేల్కొనెన్. 7

ఈ ఘోరమ్మున కేమిహేతు వని యిందేలా! మదంతస్సు కే
వ్యాఘాతమ్మని ఫాలనేత్రుఁడట ది గ్భాగాల్ సమీక్షించుడున్,
ద్రాఘిష్ఠ ప్రణయార్భటిన్ కుసుమ నారాచమ్ము సంధించి వే
వ్యాఘాతింపఁగ నున్న యాత్మభవు రూప మ్మానె జొంపమ్ములన్. 8

కుడి యపాంగము మీఱి సాఁగునది ముష్టి,
యెడమకా ల్వంచినాఁడు కుంచించె బుజము
ఇషుధను వోరఁగా మందలించినాఁడ
యెన్ని గుండెలు కలవో ధర్షింప హరుని, 9

ఆమని మిటారముల దణాయండు లతిక
లింపు సొంపారు సురపొన్న జొంపములకు
మధ్య జిక్కెను చుఱచుఱ మంట లెగయ
నాత్మభవుఁ మాడ్చె శ్రీపరమాత్మ; హరుఁడు. 10

సాచీకారిత భంగిత భ్రువుని యాస్య క్షోణి దుష్ప్రేక్ష్యుఁడై
రోచిష్కేశుఁడు నాశుశుక్షణి జ్వల ద్రుద్రాక్షి నుద్భూతుఁడై
లేచెన్ మ్రింగెను మార మండలిత శారీరమ్ము వాచాలురై
ఖే చారుల్ బతిమాలు చుండగనె సంక్షేపించె భస్మమ్ముగా. 11

గరళకంఠుఁడు సెగలు గ్రక్కఁగ నపుడె
కంటిమంటి "పడీపడ"గానె మరుఁడు
మాడి నీఱయ్యె మరుని పూఁబోఁడి వగపు
తట్టు కొనలేక మూర్ఛిల్లి బిట్టు బిగిసె. 12

గుండె పగిలి చైతన్యము కొయ్యబాఱి
మూర్ఛ కప్పుడు; నుపకారముగ సుఖించె
భర్త నుసియగు దృశ్య మాభామ కంటఁ
బడఁగనే లేద, కడు పతివ్రత కతాన. 13

పిడుగు భూజమ్ముపై వలె బడి శివుండు
తపము జెఱచిన యోధు దగ్ధ మ్మొనర్చి;
స్త్రీ యెడాటము తపము భంజించు ననుచు
నేవకులతోడ సంతర్ధి నెందె ఝుడితి. 14

తండ్రి యభిలాష తనదు సౌందర్యరాశి
విఫల మౌటయు నిది తన పెద్ద చెలుల
యెదుట జరుగుట మిగుల లజ్జించు గౌరి
తెల్లవోవుచు దానింటి తెన్నుఁబట్టె. 15

మృడుని యార్భాటమున జాల జడిసి బిక్కు
బిక్కు రంచు కనుల్మూసి పొక్కి పొక్కి
కనికరింపఁగ దగి జాలి గన్న కూఁతు
నెత్తుకొని వచ్చె; పిత తూటి నేగ్గు వోలె. 16

మరుఁడు నుసి రూపముగ త్రుటి మారి నాఁడు
హరుఁడు గణములతో మాయ మయ్యె నెటకొ
ఇంతి జనకుని తోడఁ బుట్టింటి కేఁగ
నెంచెను వసంతుఁ డేమయ్యె నే నెఱుంగ, 17

## రతివైక్లబ్యము

దిక్కుమాలిన దిట రతిదేవి ఒరగి
లేవనే లేద, యట నొంటరిగనె విద్రిచి
అడుగు పడకుండె ముందున కద్రిపతికి
పెద్దవాఁ డాతఁ డొక ఆడుబిడ్డ తండ్రి. 18

భావనాకాశ మందున భావుసకు
శీత భానుఁడు తిగ్మరశ్మియును సమమె
సుకము దుఃఖము సుకవి తూచుకొనుపట్ల,
ముల్లును లవంత నేవైపు మ్రొగ్గనీఁడు, 19

## ద్విపద.

ఓ జీవితేశ్వరా! ఓ రతినాథ!
పూ లకోరీ దొరా మోహనా కార!
సోయగాండ్రకు నీదు సుకుమార తనువె
యుపమింపఁ దగినట్టి యొయ్యారి సరుకు.
అతిలోకమైన యా యందాల నిధియు
భస్మ మయ్యెను ఱెప్పపాటులో నిట్లు,
గుండె బ్రద్దలు గాక కూర్చుంటి నేల
ఉవిదల హృదయమ్ము లుక్కు రా లేమొ! 20

హా! రతి దీపమా! ఆఱిపోయితివ!
హారతి నీకెవ్వ రందింతు రచట!
చిటికెలో నా మైత్రి చించి చెండాడి
దిక్కు నీవే యైన తెఱవ నన్నెచట
స్రుక్కు మంచే దారి చూచు కొన్నావు? 21

గట్టు కొట్టిన పెద్ద కట్టేటి రయము
కొట్టెడి పద్మమ్ము గొడవ నాకిచ్చి
యెటు పాఱిపోతి వోయీ! ప్రాణనాథ!
ధావాలలో గాని పనులలో గాని
యే కోశమున భేద మింతేని లేక
మనలోన మనమైన మన నన్ను నింత
యేడ్పు చున్నను చూడ నీవేమి! యెంత
అంకె వేసెన గాన రావేమి! నాథ! 22

ఒకనాఁట ని కొక్క యువిద పే రెత్తి
న న్నోడిపింపఁగా నను బిల్చి తపుడు
మొలనూలి దారమ్ము ముప్పేట నిన్ను
కట్టి పెట్టితి జ్ఞాప కమ్మౌనె నాఁడు
కర్ణమ్ములో సల్లకల్వతో నిన్ను
కొట్ట పుప్పొడి రేఁగి కాలికిలో టూటి
చిట్టుము ట్టుఁటితి వా చెలిమి గుర్తున్నె
ఆ గుర్తు లీ జ్ఞప్తు లన్ని నా కిటులు
కొంప ముంచిన వేమొ కుసుమాతియోధ! 23

ఎల్లప్డు నీలోన నేయుందు నంచు
ముద్దులాడుట లెల్ల మొగ మిచ్చకములె!
కానిచో నీవిట్లు కాలి పోవంగ
చెలఁగు నేరతి చెక్కు చెదర యిట్లు. 24

నేను నీ బాట నీ నీడ నే కాన
పరలోకమున కిదే వత్తునే కాని

నిను నమ్ముకొన్న ప్రాణి సహస్ర సుఖము
విధి యొకేసారిగా పిలుకుమార్చె నిటె.
ప్రియలోకమును నిటుల్ విధి కన్నుమొఱఁగె
భవ దధీనముగదా ! ప్రాణి లోకమ్ము. 25

పురిని రే యుఖములఁ బరవశలను నింక
నే సామి ప్రియుల కందింపఁ గలఁడు
కన్నెఱ్ఱ గిరగిరల్ స్ఖలితోక్తులును దూలు
తరుణుల కేల మద్యమ్ము లింక
చెలి దుర్భరపుఁ జావు తెలిసి తా వ్యర్థమం
చింక గ్రుంగుచు నెల యెట్లు వెగ్గు
నెవనిదో యిఁకఁ బచ్చ నెఱ్ఱని తొడిమలఁ
గోవెలయ్యె సుతించు మావి యలుఁగు.
వింటి నారిగ బలుమాఱు పేరు గన్న
తేటి కూటువ ఝంకృతి దీటుకొల్పి
స న్ననుసరించి యేడ్చు చున్నట్టు లదిగొ !
రొద మొదల్వెట్టె స్వరము తొట్రుపడ! నాథ ! 26

ముద్దు లొలికించు మఱియొక బొంది పొంది
ప్రౌఢభాషల సహజ విద్వాంసురాలు
కోకిలమ్మను మనమధ్య గూడుకట్టి
ఆమతించుమి సురత దూత్యా ధికృతికి 27

## ద్విపద

సాష్టాంగముగ సన్ను యాచించుటలును
నవయవాల్ గరుపాఱు నంకపాళులును
పురుషాయితమ్ములు ప్రౌఢ బంధాలు

సురత రహస్యాలు చూడ్కి వీడవుర;
స్మృతిదట్టి మురిపించి యేడ్పించు సతము. 28

రతిపండితా! నన్ను లాలించి యపుడె
ఘ్రాణోత్సవమ్ముగాఁ గనువిందు సేయ
నామని కుసుమమ్ము లన్నిన్ని విలిచి
స్వయముగాఁ బ్రత్యంగ సౌందర్య మొలయ
"ముస్తాబు" చేయుదే మొనగాఁడ వౌర! 29

చేతులారఁగ నీవు చేసిన దెల్ల
లవ మేని చెదరక రాజిల్లుఁ గాని
నిగనిగల్ మెఱపించు నీరూపు మాత్ర
నీరూప మయ్యె నే నింగి పుట్టినదొ! 30

పరమ పాపిష్ఠులై స్వార్థమ్ము నింప
వేల్పులు తెకతేర బిల్పింప నాకు
పారాణి దిద్దు చా పని పూర్తి గాక
గబగబ పర్వెతే కంగారు పడుచు;

వేవేగ రమ్మోయి ప్రియ! వచ్చి యెడమ
పాదమ్మునకుఁ బూర్తి పారాణి యిడుము.
నేను రా నందువా! నీ చిచ్చుబాట
తురతుర వచ్చి నీ తొడ నెక్కి యుందు. 31

నెఱజాణ లచ్చరల్ నేత్రాలు చాపి
బిరబిర బుట్టలోఁ బెట్టి కొందు రట
వలపన్ని యుచ్చులోఁ బడవేతు రంట
మచ్చు మందిచ్చి నిన్ మరలించు లోస
నాకు నేనై వచ్చి ననముద్దు లిడుదు. 32

వత్తువేమో యంచు భ్రమ సాఁగి యింక
రావంచు నే వచ్చి వ్రాలు నంతటనె
"సాధ్వియౌ రతిదేవి క్షణము ప్రాణేశు
పతిదేవు విడిచి తా బ్రదికిన" దంచు
నెఱనింద యొకటినా నెత్తెక్కు నింక. 33

జీవమ్ము విడువఁగాఁ జిచ్చు వెంటాడి
శవమును బుగ్గిగాఁ జంపి కాల్చినది
తుది యలంకారమ్ము తొడిమ పూవేసి
పరలోక మేఁగు నా ప్రాణేశ్వరునకు
నలరించు కొసు పెట్టు లయ్యొ రతీశ ! 34

జ్యా సుట్టి బాణమ్ము సాఁగించి విల్లు
తోడ బెట్టి చిఱునవ్వు తోఁడ వసంతు
గుసగుసల్ కొసరించు కొంచుఁ గ్రీఁగంట
సాఁగి నన్జూతుల్ ! స్మరియించు కొందు. 35

పోయెను జీవమ్ము పోయె శవమ్ము
మన గాథనే చిచ్చు మండింప లేద !
కథలకు నేనుంటి కథలు నాకుండె
నీపైని కథల కిం కెవ్వరో నాథ ; 36

మనసార ప్రేమించి మదిఁగొన్న సఖుఁడు
వింటికై పచ్చని విచ్చు ఁబువ్వులను
సృష్టించి పతి కిచ్చు చెలికాఁ డతండు
నెందేఁగె; గాన రాఁడే వసంతుండు
పరమ కోపాంధుఁడీ ఫాలాక్షుఁ డిచట
మా వసంతుని గూడ మాడ్చలేదు కద ! 37

గొల్లుగొల్లున రతి యిట్లు కుళ్ళి యేడ్వ
నా వసంతుఁడు విని హృదయమ్ము నందు
విసపు బాణాలు గ్రుచ్చిన విధము కుమిలి
ఊఱడింపఁగ వచ్చి నిల్చుండె నెదుట. 38

అతని గనినంతనే హృదయమ్ము పగుల
వలవలని యేడ్చె గుండెలు బాదుకొనుచు,
స్వజన మెదురైన దుఃఖ ప్రవాహ మిటులు
పొరలి వచ్చును తల్పులు తెఱచి నట్లు. 39

ద్విపద. "ఓ వసంతా! చూడు మో ప్రాణమిత్ర!
గుమిగూడినను నెంత కొంప మున్గినదో!
పుష్పబాణుని మేను పొడిపొడి యయ్యె
శ్రీ రతి హృదయమ్ము చీఁకురించినది.
పావుర మ్మలరించు పలురంగు లెత్తి
ఎగిరి పోవుచు నుండెనే గాలి ధూళి
ప్రాణమిత్రుని కంటివా! తుదిసారి"
"కలిమి కల్కిం దేల్చు గారాల బిడ్డ! 40
పురుషోత్తముం డెత్తి ముద్దాడు కుఱ్ఱ,
పృథివిలో భార్యపై ప్రేమ చంచలము
నెఱమిత్రు ప్రేమమ్ము నిత్యమ్ము కాన
ప్రాణమిత్రుం డిదే వచ్చె నీ కొఱకు,
దర్శన మిమ్ము నాథా! వాని కేసి. 41

తామరదారమ్మె ధనువు సూత్రముగ
పువ్వుల కీలాలె పోటు ములుకులుగ
ముజ్జగమ్ములు నీకు మోఁకరిల్లుటకు
హేతువు సహచరుం డీ వసంతుండె!

ఇతని నేనియు జూడ నిమ్మోయి నిన్ను
ఇతనికి దర్శన మీఁకుంట తగదు" 42

"గాలిలో దీపమ్ముగా నాఱిపోయె,
రాఁడు సఖుండింక రాలేఁడు కాని
సహింపరాని విషాదమ్ము పొగల
మాడిన పత్తినై మనుదునో యింక. 43

విధి వచ్చి నేఁడింటు, బ్రియుఁ జంపినాఁడు
ప్రియుఁడును బ్రియురాలు వెరసి యొక్కటియు
నగుటయు చంపఁ గొఱంత సావదా ! యింక
ఆధార మని నమ్మి నట్టి వృక్షమ్ము
భద్ర గజమ్మొండు పడగొట్టి నపుడు
ప్రాఁకిన తీఁగమాత్రము రాలిపోదె ! 44

పాదాలు పట్టుక ప్రార్థింతు నిన్ను
దిక్కులేదే; దిండు నేదియు లేదు నాకు,
నీవొక్క సుట్టమే నిలిచినా విందు,
ఉపకరింపుమి యున్న యొక బంధు వగుట.
చిచ్చు కాల్చిన భర్త చెంత సేవింప
చిచ్చు బాటనె నన్ను చెలికి పంపు" మని. 45

నిశ్శ్రేయస నశ్రేయసి
నశ్రోత్రియ మైన బ్రతుకు నా కేల యటం
చాశ్రయభోక్తను దలఁచుచు
నాశ్రమముం జూడ శ్రమమునహో పడిఁ బెంపన్. 46

"చందిరు తోడిదే శార్వరీ దేవి
మేఘుని తోడిదే మెఱపు నాశనము,

పెనిమిటి తోడిదే పెండ్లాము బ్రతుకు
అవివేకులును సైత మరసినా రిద్ది. 47

అందమ్ము లొలయించు బ్రాణేశు బుగ్గిఁ
బొరలి బూడిద వన్నె పొక్కి వెక్కించి
పైఁట పిట్టలతోడ బ్రభ లీసు మేస
చితి మధ్య దూఁకుటే నేమమ్ము నాకు,
పల్లవమ్ముల నెట్టి పాన్పు మెత్తనిది,
హంసతూలిక తల్ప మగుఁ జిచ్చు హాయి. 48

పతితూలి గతిమాలి బతిమాలు కొందు
పలుమాఱు బ్రణమిల్లి బ్రార్థింతు నిన్ను
వేమాఱు మాకు నీవే కదా పూఁ
పాన్పు సృష్టించెడి పరమ బంధుఁడవు,
వెచ్చని చిచ్చులో విసము పూరించి
నేఁడొక పాన్పట్టై నిర్మించు మయ్య: 49

చితిపేర్చి నన్నందు చేర్చి వెన్వెంట
మలయ వాయువు వీచి మండింతు గాక,
నిముస మేనియు నొంటి నిలువ లేఁ డతఁడు
రతిభర్త రతిలేక బ్రతుక లేడిపుఁడు
ఎఱుఁగుదువే కదో యీ రహస్యమ్ము. 50

నీటితో నంజలి నించి ప్రేమార
నిర్వ్వర కొక్కటే యిచ్చు కొ మ్మయ్య!
కలిసి యొకేసారిగా మేము ద్రాగి
సరస మాడుదు మద్ది సఖునకు సుఖము. 51

పిండమ్ము పెట్టెడి వేళ గుర్తించి
మావి పూఁజషకమ్ము మా కిమ్ము మిత్ర!
మన చెలికాని కా మావి పువ్వనిన
నుడిరాని గుటకల నోరూరు గాదె" 52

అనుచు మతిమాసి నిశ్వాస లణగి మణఁగ
నగ్ని పర్వతములు బ్రద్దలైన యట్లు
కంట "లావా" ద్రవాల్ తరంగాలు పొంగి
"యుప్పెన" గ ముంచె నా వయస్యని జరీన. 53

సరస నోదార్ప వచ్చు వసంతు మదికి
గుండెగ్రుద్దులు రతినుండి గ్రుచ్చుకొనియె.
ఆమె మొఱ్ఱలఁ దన హృదయమ్ము కరిగి
పంటి గుంటలు పాథోధి కాఁగ నేడ్చె. 54

ఇంత వాపోవు రతి పలవంతఁ గనఁగ
బెదరు జాలియు కంగారు పెనఁ గొనంగ
నొక వితాకున నోరు నొక్కుకొని పోయె
నిట్ట నిలుచుండెఁ గొయబొమ్మ యట్టు లంత. 55

"పుండరీకాక్షుని పుత్రుం డతండు
లక్ష్మికి నేను గారాబు కోడలను
బ్రహ్మ నాకొక పెద్ద బావగా రగును
పరమేష్ఠికిని ముద్దు మరదలన్ నేను
తోడుకోడలు సృష్టిదొరసాని నాకు
హరి హర స్వాముల కద్వైత మాత్మ
హరునకునుం గోడ లౌదును నేను
కొమరునే నుసి నేసి కొన్నాడు హరుఁడు.

వైధవ్య మిచ్చెఁ గపర్ది కోడలికి
మామయ్యగారు సమాధి వీడ రఁడె
అత్తకు నా వార్త నందింప రెవరు
సత్య లోకముదాఁకఁ జనదు నా మొఱ్ఱ
గుర్తింపఁ డా మందకొడిబావగారు 56

బందుగు లింతమంది కల భామినికిన్ గ్రహచార మింతగా
గుందులు కొందలమ్ములును కోటలుగట్టి నివాసమున్నచో
నెం దెవ రింక సౌఖ్యము ఘటింతురు; నెవ్వరు హాయిహాయిగా
నుందురు; సంయమీశ్వరుల కొప్పునె యిట్టి క్రుధా స్ఫులింగముల్. 57

వైధవ్య మ్మిటు మాదృశాబలకు సంభాషించి నీ వే క్రియన్
సాధింపన్ సమకట్టితో పశుపతీ! జంభారి కర్తృత్వ మా
రాధింపన్ ననముల్కి సాధనముగాఁ ద్రైలోక్య జీవాతువుల్
ప్రాధేయంపడి దేవులాడ నిది సంప్రాప్తించెఁ దప్పేరిదో! 58

త్రైలోక్యేశుఁడు లోక కంటకుల జీల్పన్ బ్రహ్మకున్ మ్రొక్కె నా
నాళీకాసను మాట బట్టుకొని యీ నా నాథు నుచ్చింప నీ
కైలాసాధిపుఁ జేరినాఁడు పతి. ఈ గాథన్ సమీక్షింప నా
లాలాటాక్షుఁడు నేవ కానుగత మర్యాదా నభిజ్ఞుం డగున్. 59

జలజాతాసనుఁ డైన బ్రహ్మకును నాజ్ఞాకారి జంభారికిన్
ఛళి యుంచుం దలలూఁచు బెద్దలకు నెన్నందగ్గ దీ శాస్తి నా
లలితుం డింతటి శిక్ష సందుటకు బేలా! సాధ్వి నర్ధాంగినై
మెలఁగంగా రతి కొంప కూల్చితివి సామీ! నీకు బాగున్నదా! 60

తేరఁగాఁ గంటిమింట వీతేర మరుని
దుడుకు దుడుకున దుమ్ముగా దులిపినావు,
మమ్మువిడ గొట్టి నీ వెటో మాయ మైతి
పిచుక పైని బ్రహ్మాస్త్రము విడుతు రటవె! ·61

ఒకటే యేడు "హలో హలో" మనుచు "మొట్టో" యంచు నాకేది
క్కొక నే నేగతిఁ బోవఁగా వలెనొ ! సర్వేశాన ! నా కేలొకో
మొకమోట మ్మికఁకనంచు ధీర వచనమ్ముల్ సాచి కేలెత్తి యా
ర్తికి లోనై తన భారతీయ ధరణీ దీప్తుల్ పురాణింపఁ గన్. 62

"తనదు ప్రియురాలు తనకు వ్యధన్ సృజించె
తాను నా కిచ్చినాడు వైధవ్య మింత
రుచి నెఱింగియు దాను నోర్చుకొనలేని
యిట్టి చిచ్చు నాకిచ్చె నే నబల ననియొ ! 63

స్వామిభక్తి పరాకాష్ఠ ప్రబలి యున్న
శివిగల డింగరీఁడు కడింది మగఁడు
ప్రాణపతి వాని యాదర్శ పాలనమ్ము
ధర్మపత్నికిఁ బ్రథమ కర్తవ్య మనుచు. 64

"నేనే శ్రీ పురుషోత్తమ స్నుషన యేనీ ! బల్ మహా సాధ్వినై
నేనే మన్మథ జీవితేశ్వరిన యేనీ ! భర్తృ పూజా రతిన్
నేనే తత్సహధర్మ చారిణిన యేనీ ! యీ ప్రపంచార్ధ మీ
శానుండింక దనంతఁ దానె గిరిజా సౌరభ్య మర్థించుతన్ 65

అంతియే కాద తనదు దేహమ్మునందు
ప్రేమమై సగపా ల్సమర్పించుగాక
భార్యకు భవాని భర్తకుఁ బరమశివుఁడు
లోక దృష్టాంత భూతులౌ గాక వీరు. 66

గంగాధార తురాయి వీచు దలపాఁగా నాఁగ రేఁగంగ సా
రంగాంకోరగముల్ జటా వితతిపై లాస్యమ్ము లుబ్బింప, ఖ
ట్వాంగా లంకృత పాణియే జగముకల్యాణాలు పండింప మే
ల్మాంగళ్యమ్ములు నేకరించి గవరమ్మున్ సాఁక్షి పే ర్కొందుతన్. 67

ఆహా! పాపము బిక్కు బిక్కురని కొయ్యం బాఱి మూర్ఛిల్లి యే
దో హైన్యమ్మగ బిచ్చి తల్లి యయి కంతు ప్రాభవ స్ఫీతయై
సాహంకారత వెక్కుచున్న దల పశ్యత్ఫాల ఘోర జ్వల
త్స్వాహాజానియె యీ యనంగశర సౌభాగ్యమ్ము సృష్టించుతన్. 68

కికురింతల్ నకిలీనయమ్ములును సంక్షేపించి లాలాటికా
గ్నికణాల్ నా విధవాత్వమున్ ఝటితి బుగ్గిం జేసి పేరందుటో!
ఒక సాధ్వీ విధవాంత్వమే హరుని నాహూతించి చిచ్చొటయో
యిక తేలన్వలె, ఘోర దుర్భరము బంహిష్ఠమ్ము వైధవ్యమే 69

న్యాయమును కన్మొఱంగి తొందరకు లోఁగి
హరుఁడు సుమచాపు మాడ్చిన యప్రతిష్ఠ
స్వయముగా వచ్చి గౌరిని సరసమాడి
పాపుకొనుగాక! హరుఁ డేమి పాపమునకు! 70

హరునకై యడలిన హైమవతీదేవి
సౌభాగ్యమునకు నాశాస్య మిద్ది
వందారు బృందార సందోహ మునకిద్ది
యొక పతివ్రత యిచ్చుచున్న వరము
అవిమృశ్యకారియై యంతర్ధియై యేఁగు
పరమేశు కృతికి సంస్కరణ మిద్ది
స్వామియౌ నా శచీజానికి, దేవతా
పతికిఁ గృతజ్ఞతా వందన మిది
ప్రాణపతి పుష్పబాణున కాత్మశాంతి
భారతీయ ధాత్రీ ప్రతిభా వచస్సు
క్రొత్తదీ తనమ్ము పొలిమేరలో మహస్సు
పలుకమారి పతిభక్తిభర మనస్సు. 71

మృడుని పసు చిచ్చు వెన్నుని కడుపు కోఁత
గా మొఱాయించి యిటు పరిణామ మందె
హరి హరాద్వైత బుద్ధికి నంజలింతు
గాక నే నెట్లు సైతు నీ కడుపు మంట 72

దాంపత్యార్థము విస్మరించి సతి దగ్ధమ్మౌటచే నిట్లు నా
కొంపం జిచ్చు రగిల్చినావు పరమోగ్రుం డౌట నా కుక్షిలో
అంపంపుం గసికోఁత వెట్టితివి రౌద్ర క్రౌర్య ముబ్బించుచున్
చాంపేయాస్త్రుని రాణివాసమువిషశ్వాసాగ్ని నీవోపుదే ! 73

పౌలోమీ పతి యీ మదీయ విధవాత్వ మ్మెట్లు సైరించునో
నైలింపాళి యెటుల్ సహింపదు శివా న్యాయ ప్రభావమ్ము; నే
తాళన్ లేనిఁక నా కెవండిట సమాధానమ్ము వాక్రుచ్చు నే
కాలాతీతుఁడు పుట్టి యే గతిని వ్యాఖ్యానించునో నాగతిన్ 74

ఇది సునాసీరు రాణి భరింపఁ దగిన
ప్రాణహరము మర్మ స్పృశమైన దెబ్బ;
ఎట్టి పాప మ్మెఱుంగని యీ సుమాస్త్రు
రాణివాసము భరియింప లేని పిడుగు: 75

జాయయున్ పతి శబ్దాల సాఁగింపు
దంపతి పదమ్ము సృజియింప నింపు లొలికె;
విడి వడగరాని నెమ్మి ముప్పేట పేని
చూఱగొందురు మంగళ సూత్ర మిచట. 76

ద్వైత మిడిన యద్వైత భావ పదము
లేకశేషము లౌచు భాసిల్లు గాక
శత్రువున కేని వలదు శ్మశాన దేవ !
తాళిఁ ద్రెంచెడి సంస్కృతి గోల లెపుడు. 77

పాణిన్యాచార్యుల మేల్
వాణిని స్మరియింంతు మేని ద్వంద్వమునన్ స్త్రీ
ప్రాణియె లోపింపన్ వలె
కానీ! యన్యము నేలఁ గాల్చితి విచటన్. 78

లేలిహానాలొ! గరళమొ! శూలమో! మ
దీయ వైధవ్యమును బుగ్గి సేయకున్న
విశ్వసృష్టికి గొడ్డలిపెట్టు గాదె
భారతీయ ధరా శాప వహ్ని దంష్ట్ర. 79

సూనశరుఁడు సుఖాన లేచుటయు సతికి
నిటలవహ్నియ తాళి గట్టుటయు, లేక
ప్రాణపతిపైని నే భస్మమౌట యనెడి
మూఁట నొకటేని వెలయుట మోద మగుట. 80

అని గ్రుడ్లెఱ్ఱఁగ బొబ్బరించుకొని యాస్య మ్మెల్ల రక్తచ్ఛవుల్
తొణఁకం జూచు పతివ్రతన్ సయన కల్లోలాగ్నులన్ సైఁప లే
నని చేరెన్ శచి; తాఁ బతివ్రతల మాహాత్మ్యమ్ము ముక్కాల మం
దున నద్దాని పునాదు లందు గల లోఁతుల్ దా నెఱుంగుం గదా! 81

"తల్లీ! నేను శచీ పతివ్రతను క్షంతవ్యమ్ము దోషమ్ము; నీ
యుల్లమ్మెల్లను వల్లకాఁడగుట కీ యుగ్రుండు బాధ్యుండు కా
డెల్ల న్నీ పలుకుల్ నిజమ్ములు విమర్శింపంగ నస్మాదృశల్
కొల్లంగొట్టుట ధర్మమా! హరుని ముంగోపిన్ సతీత్వమ్మునన్. 82

అగ్నిహోత్రుని చేతితో నార్ప రాద;
తెమ్మెరన్ నిట్ట నిలిచి కుందింప రాద;
దైవము నెదుర్కొఁనం బ్రసాదమ్ము రాద;
తగిన బాట గమించుచో ధన్య లగుట. 83

పరమేష్ఠులకు గూడఁ బరమేష్ఠియై యిలన్
పాలకుం డయిన సర్వజ్ఞుఁ డితఁడు
ముక్కోటి దేవతల్ మ్రొక్కఁగా వారికిఁ
బ్రాభవ మ్మిడుట కపాలధారి
కమల జాదిక ప్రసంఖ్యా నానుభూయమా
నాతి తైజస పరంజ్యోతి యితఁడు,
తే॥ చరాచర సృష్టి రాచఱిక మ్మందుఁ
బ్రతిచోట నితని దాధ్వర్యవమ్ము,
అన్ని ధర్మాల కితఁడు సింహాసనమ్ము;
అట్టహాసమ్ము వెల్గుమై సఖిల జగము
దేజసన యేలుకొను నటరా జితండు,
శంకర స్వామిలో దోష శంక తగదు. 84

శంకరుఁ డెంత కోపి యని శప్తుఁడఁ జేయఁ దలంచి యింతగా
నంకిలి తొచ్చులోఁ బడితి మంతకుఁ గోటికిఁ గోటిరెట్లుగా;
న్యంకు ధరార్ధమౌళి కరుణా వరుణాలయ సార్వభౌముఁ; దే
ణాంక కిరీటి కింకరుఁడునై సుఖియించును భక్త రాజిలో. 85

ఫాలనేత్రుని హృదయ కవాట మెంత
నల్ల పాషాణ మంచు భీతిల్లు చుంద్రొ
అమృతకర మౌళి మానన మంతకన్న
పెద్దగా ఘుమఘుమించు తావికి గొటారు. 86

భక్తికే లొంగి తనుఁగాల్చు వరము లిచ్చి
మాఱు మాటాడలేని యమాయికుండు,
దృష్టికిం బొడగట్టదో! దుష్టుని గని
ముద్దిడఁగ, కాటువడ, మూరె బొట్లకాయ. 87

ఆ జగన్మాతృ కాంతి శంపాబ్ధి లోని
జీవ కళకు భ్రాంతిల్లి మూర్ఛిల్లె నేమొ,
మనసు దుర్బల మౌచు ప్రమాద పడెనొ !
బ్రహ్మకే దిక్కులేద జాపశపుహాంక. 88

గరళ కంఠుని గరళమ్మె కలువ ఱేకు:
నొసటి చిచ్చును బొగడ పూ పసఁడు పదును,
శూల మిక్షువు; పునుకలు పూల సరులు,
ఎల్ల భక్తులకును నమాయికుఁడు శివుఁడు. 89

ముల్లోకమ్ముల నేలు దైవము సుడిన్ పుష్పాస్త్రుఁ డేతెంచి తా
విల్లెత్తంగనె భస్మమై యెగుర నీ విడ్డూర మేర్పడ్డ దో
చెల్లీ! నీవిఁక నింద్రునానతి శచీ జీవ ప్రియాత్వమ్మునన్
చెల్లంగావలె; రాజధర్మమిది, ముందేమేమి కానున్నదో ! 90

నేనున్ సాధ్విని, నీ సఖీత్వమున రాణింతున్ మహా సాధ్వినై
సూనాస్త్రున్ బ్రదికించు కొందము, శివున్ శోధించి సాధింతమున్.
నే నెప్డుందును నీ యెడాటమున నేణీలోచనా! ఈ శచీ
ప్రాణాల్ నీవియ! నీవి నా, యవిగఁ గర్తవ్య మ్ముపాసింతమున్. 91

తారకా సుర విజయి జంభారి కాఁగ
బ్రతికి శంకర జేత నీ భర్తగాఁగ
శాప శాంత పరీతాప రూప మేదొ
కదిపి సాధ్వీత్వ శక్తి నూపుదము రమ్ము.
శంకరుఁడు చిచ్చు దటిసెనా! సతి నశింప,
లలనలకు మాత్ర హృదయ దౌర్బల్య మేల ? 92

సతికి సహగమనమ్ము సద్గతికి రాచ
బాటకావచ్చు; మన సేయు వలయు పనికి

నీపయిం గర్త లెవరు తల్లీ! అనన్య
సాధ్య సాధనకై లెమ్ము సఖిరో" అంచు. 93

ఆర్పలేని దుఃఖమున కోదార్పు గాఁగ
జయము నగ్గించి బతిమాలు సరణి గాఁగ
కార్య శూరత కుత్సాహ కారకముగ
సూక్తులూఁచు శచీదేవి కూఁత గాఁగ. 94

"మసగొని ధాత నా డొడలు మండి శపించిన కారణమ్ముగా
కుసుమ శరుండు బుగ్గియయి కోమలి కీ గతి పట్టె; నైసది
గ్వసనుఁడు పార్వతీకరము గట్టిగ పట్టుట తప్పదప్పు సం
తసముగ శ్రీరతీశుఁడు నసల్గొని లేవక తప్ప దేవుమై." 95

కోప మ్మీగిన నాఁడె యా నలువ యుద్ఘోషించె శ్రీ ధార్మికా
లాపాల్ మెచ్చి యిటుల్, కత మ్మిదియ లాలాటాగ్ని కింధనమై
మీ పుష్పాస్త్రుఁడు బుగ్గి యౌట కిఁక గాంభీర్యమ్ము చేపట్టుఁడీ!
తాపా లేపటి శాప కోపన పృధా తంటాలు చల్లారుతన్. 96

నొసలి చిచ్చును మిడుతగా విసిరి, యపుడె
సాకతము జూపె శారదా జాని యిటులు
ఎనొ గదా! అంబుధరుఁడు జితేంద్రియుండు
పిడుగు నమృతమ్మున నట బయ ల్వెడలు కతన. 97

ఓ యనంత సౌభాగ్యవతీ పతివ్రత
తా శిరోమణి! ఇనుఁడింక నాఱఁబెట్టు
నదికి గ్రీష్మము సురిఁగి వానలు చిగిర్చి
వెల్లువలు పూసి పుడమి శోభిల్ల దటవె! 98

దండశూక పరిష్కార పంచసములై
మిమ్ము సోఁకు శచీసూక్తి మేలు మేలు;
భావి కాలము మీకు శుభావహమ్ము"
టంచు నాకాశ వాణి వీతెంచె నంత. 99

మండుటెండకుఁ దల్లడం పడుచు మాడు
నాఁడు బేడిసఁ దొలకరినాఁడు వోలె
ఆశమైఁ బ్రాణ మిచ్చె నాకాశవాణి
రతికి; బ్రత్యాశ బ్రాణికి బ్రదుకుబాట 100

అంతలోఁ బుష్పబాణున కాత్మ బంధుఁ
డగు వసంతుఁడు లేచి యిట్లనుచు పెచె;
"ఏలుక తత్తడి యాశ్లేష మెలయ బోవుఁ
దనువు నిలబెట్టి శచిదండ మనుము తల్లి ! 101

ధర్మశాస్త్రము నమ్మి నీ తనువు గాల్చు
కొందువా నేఁడు! లేవు మా కుసుమ శర్యుఁడు
లేచుచో నేఁటి నీ గతి యేఁమి దనను;
శాశ్వత బ్రహ్మచారిగా సమయ గలఁడె ?
ధర్మసూక్ష్మలు గుర్తించి ధన్యవగుము. 103

మావి కిసలయముల గూయు కోవెలకును
నీవు నిల్చిననే యింక జీవముండు
విశ్వసింతము వినువాణి యాశ్వసనము"
టంచు నూఱట బల్కి శ్వాసించి నిల్వ. 104

ఆర్యం గూఁతును బుజ్జగించుచును ధైర్య స్థైర్య బుద్ధిన్ హిమా
హార్యం డా నసఁ దర్జని న్నిలిపి "కట్టా" యంచు "శ్రీ శారదా

భార్యాభర్తలు హాయిహాయిగ సుఖింపంగా, రతి ద్వంద్వ మా
ధుర్యం బీగతి మండిపోయె; నిఁక నెందుంగద్దు ధర్మ మ్మిలన్, 104

పాతివ్రత్యవతీ శిరోమణివి, దివ్యప్రజ్ఞ నీ సొమ్ము, నా
కూఁతుం గూరిచి నీ మనఃప్రియుఁడు బొగ్గుం బుగ్గి యయ్యెం; బరం
జ్యోతి స్స్వైర పరాత్పరున్ వశ మొనర్పన్ సత్తప మ్మొక్కఁడే
హేతుల్ యుద్ధము లస్త్రముల్ హరుని సాధింపన్ సమర్థమ్ములా! 105

లీలాదిత హాలాహల
లాలిత కోలాహలా చల ప్రియ సుతుఁడన్,
మేలెంచి యాలపించు శ
చీ లలనా సూక్తి శిరము జేర్పుము తల్లీ! 106

అంతో యింతయొ దైవత ప్రకృతి నా యుందుం బిసాళించె. వా
సంత ప్రాణసఖుండు నీ ప్రియుఁడు నా చంద్రా శ్మ వాః క్షాళిత
ప్రాంత ప్రేరిత కేతకీ సురభి హర్మ్యా లందు శర్వాణి నీ
మంత ప్రాంత నిరంత లగ్న సుషమా మంజిష్ఠ మగ్గించుతన్." 107

పుష్పసాయక జీవాత్మ మోహరించి
ఇవము తెఱలాట నడుమ దాండవ మొనర్ప
సతము శర్వాణి లావణ్య జలధి యైన
గిరిగుహం జొచ్చి కాలము గెంటుగాక." 108

అనఁగ; శచి యాదిదంపతి ప్రణయ ఫలము
దివ్య కళ్యాణ మందు దిదృక్ష నేఁగె,
గిరిపతిన్ భక్తితోన మ్రొక్కఁన వసంతు
తో "సహా" శచీపదము లందుకొనె రతియు. 109

ఆకాశవాణి వా క్ప్రాచుర్యమున రతి
ప్రాణ పంచకము పేరాస నిలిచె,
కులపర్వత స్వామి వెలయించు నూఱట
సహగమ నాభిలాషను మరల్చె,
హరిరాణి సురరాణి వరవాణి యెరాణ
రాకాసి వధకు నుద్రేకపఱచె.
ఆత్మబంధువు వసం తాభిరా మాలాప
సరణి జీవితపు టాసను సృజించె,
హైమవతి జాలికార్చు నుష్ణాశ్రు ధార
శంకరు జయించు కాంక్షను జాలుకొల్ప
రాత్రికై వేచు పగటి చంద్రకళ వోలె
చిక్కి రతియు తపస్సు చేసినది దివిని. 110

"హాలాహలి కోలాహలు
హాలాహేలలకు మధ్య నార్యగళమునన్
తాళి గ్రథించుత ధ్రువముగ
పౌలోమీ రమణ విజయ పణవము మ్రోఁతన్. 111

ఊఱడింపఁగ రతిపజ్జ నోరు రాద
మార మారుని టాఱగా మనసు రాద
సర్వమంగళకై మనశ్శాంతి లేద"
అనుచు నగరాజుఁ గూఁతుతో నరిగె నెటకొ! 112

శ్రీశైలు నీవి. సంసృతి
నీరాశి లిలంఘయిషు సు నిశ్చప్రచ ధీ
వారమునకు పారము నిడు
భారము తల గల మహేను భాహా! హనుమా!

——

# కళ్యాణ కావ్యము

## తార్తీయీకము

శ్రీమ త్సార్వపథీన
క్షేమంకర రోమరోమ కీలిత శ్రీరా
మా ముఖ్య మంత్రి రాజ
స్వామీ! ఉచ్చావచ ప్రభావా! వినుమా!

### పరిష్కృత స్త్రీ

ఇలువేల్పుల్ గల రిచ్చ మెచ్చెదరు పూజింపంగ రాదా! తప
మ్ములకీ నీ సుకుమార గాత్ర మెటు నప్పున్ పిచ్చితల్లీ! సుగం
ధిల సూనమ్ములు తేటి వ్రాలుటకె కానీ; పెద్ద రాబందు ప
క్షులు వ్రాలన్ సహించునో; శిత తపః క్షోభల్ కఠోర క్రియల్.

ఇంద్రి యాశ్వాల తరటు బంధింప వలయు
పంచ భూతాల ధాటి నోపంగ వలయు
ఉగ్రమూర్తిని బంధింప నుక్కు పిడుగు
లేని తగ వన నీవెంత నాన" వనఁగ 3

అమ్మా! శంకరుఁ జంద్ర శేఖరుని యర్ధాంగిత్వ మాశించి ప్రా
ణమ్ముల్ వానికి మీఁదు గట్టితిని. సౌందర్య మ్మనన్య మ్మల
భ్యమ్మున్ దీనికి దేటు గూర్తు పర మైకాగ్ర్యత్వముం బూని శా
ర్యమ్మున్ వీడుమి. దీనికై పెరటి బాటల్ లేవు వేఱేమియున్ 4

గిట్టె వలదిట్టు; యట్టు మా యెట్ట యెదుట
కన్నులారఁగ జూచిరి నాన్న గారు
ఇంత సౌందర్య మేల తల్లీ! కపర్ది
నాథుగా గొంట యిట్టి సౌందర్యఫలము.

అసి ధారా వ్రత నిష్ఠురమ్ము తపమే యౌగాక. మోక్ష ప్రఫా
రసికున్ శంకరుఁ గౌఁగిలించుటకు సర్వజ్ఞ ప్రియ ప్రేమకున్
కుసుమా రాధన మాటలా! ఎటులు దక్కున్ వాని తాదృ క్సుఖా
శ్వసనమ్ముల్ నను వీకు మంబరా! మహేశానున్ వరింపన్ వలెన్. 6

గరళ కంఠుఁడు శివుఁ డగుం గాక; వాని
నుదుటి కంట నెఱా చిచ్చు ప్రిదులు గాక.
విష్ణు పాథో ద్భుప ఝ్ఝురీ వేల్లనములు
పాల్కడలి వెన్నయున్ తలపై వెలుఁగు

అల్ల మృత్యుంజయుఁడు ప్రియ వల్లభుండు
కాఁదగు దపమ్ముఁ గూఁతురు కాంక్ష సేయ
ఆశిష మ్మిడి పంపుదు రంతె కాని
పిఱికె మందు బెట్టుదు రఁటే వెఱ్ఱితల్లి! 8

అపు "తనస్య భాజం పతి మాప్నుహి" యను
ఆశిషము నిర్వచించె సుమా! సమాధి
లేవ. నే భక్తితో దోయిలించి నపుడు
కల్ల గారాదు చంద్రశేఖరుని పల్కు"

అనఁగనే కౌఁగిలించి తొ మ్మదిమి కూఁతు
మిగుల బతిమాలు మేనకాంబిక కుమార్తె
వజ్ర సంకల్పమున్ మరల్పంగ లేక
పల్లమున కేఁగు నీరని వదలి వైచె. 10

ప్రియముగఁ దండ్రితో సభినివేశము దెల్పె సఖీ ముఖానఁ; ద
న్మయుఁడయి తండ్రియున్ సుతకుఁదగ్గ కుటీర మరణ్య మందు బల్
నియమము లానుకూల్య సరణిం గొనసాగఁగ నేర్పరించుచున్
"జయము తథాస్తు" టంచు దన సమ్మతి నాశిష మిచ్చి పంపుడున్. 11

తలి దండ్రుల యాన, నిటీ
వల "గౌరీశిఖర" మంచు బ్రజ తనపేరన్
బిలిచెడి, నెమళ్ళు నర్తన
ములు సలిపెడి శిఖర మెక్కి ఘురిసె దపమునన్. 12

ఱొమ్ముపై మంచి గంధమ్ము పేటుల రాచు
ముత్యాల హారాలు బుజికి వైచె,
పాలిండ్ల రాయిడి బలుచనై లేఁత సూ
ర్యునిబాజు నార చీరను ధరించె.
శయ్యపై పూలోసేఁకి కుయ్యి పెట్టెడి మేను
రానేల నే కేత్తులాడ పోరలు.
ధరియించు మొల నొడల్గరుపాఱఁ నింపుగా
ముప్పేట పేనిన ముంజె త్రాడు.

పూలతో నత్తరుల నెట్లు భూషితమయి
పాఁపటన్ గౌరి మోము గుబాళి మీసు
నట్టులే జడల్ కట్టియు నలరు చుండె.
తుమ్మెదలె కాక నాఁచును దమ్మి కింపు. 13

అధరమునకు లాక్షా రస మద్దు వ్రేలు
పైఁటపిట్టల మైపూఁతఁ బడుట నెజ్జి
గా నగుం గంపుక మ్మెత్తు కరము కలుకు
దర్భలం ద్రుంపు. త్రిప్పు రుద్రాక్ష సరము. 14

సన్న తీవెంలో విలాస క్రియలును
లోల దృష్టులు హరిణాల లోన దాఁచె.
కాని తపించెను జగదంబ; ఘోర తపసు
సిద్ధి బొందిన పిదప దీసికొను కాంక్ష. 15

పూలమొక్కల బండ్లవృక్షాల నామె
కుండపాలింట్లు చేఁపి నిగ్గులుగఁ బెంచె,
స్కందుఁ డీఁక ముందు పుట్టినఁ గాని కడుపు
తీఁపి సొక్కదు మొక్కల త్రోపు లందు 16

బుజ్జవమ్మన మేఁతతో బొజ్జ నింపు
నమ్మకమ్మునఁ బ్రేమము ననలు సాఁగ
గౌరి నయనాల ఁదమరపు కన్నుదోయి
కొలుచు కొసుచుండు వేళ్ళ బెత్తులు ఘటించి. 17

స్నాన మధ్యయ నాదులు నారచీర
ధారణమ్ము హోమాది, యథావిధిం బొ
నర్చు గౌరిని గని మునుల్ నతు లొనర్తురి.
లేఁత ప్రాయము లేమ ధార్మికత పట్ల. 18

సహజ విరోధి జంతువులు సైతము తాము పరస్పరా దృతిన్
తహతహతో సుఖించును. వనమ్మున బుష్ప ఫలాల కల్మి: న
స్వహ మతిథి ప్రపంచము సపర్య నొనర్చు దరుల్ పరీమళా
వహు నట నాహుతింత్రు భయ భక్తులతో నుమ పర్ణశాలలన్. 19

ఇట్టి జంతు సముచ్చయ మిట్టి తరులు
ఇట్టి హోమ జటా జ్వాల లెందు గలవు!
పావ నాతిపావనము సౌభాగ్య సురుచి
రా తిరుచిరమ్ము, నిది గిరి జాశ్రమమ్ము. 20

ఆర్య కొకనాఁటి మునిమాపు నందు పొడమె.
నల్ప మీ తప మని సందిహాన ఫలము.
ఉమ మృదుత్వము ప్రక్కల కొత్తిగించి
నడుము కట్టె దారుణ జపోన్నతికి లేచి, 21

పూల చెండ్లాటకున్ శ్రమమ్మును గ్రసించు
నబల ఘోర తపస్సుతో నతిశయించె.
మృదుతయు గలాదుఁ కఠినత మేవడించె
పసిఁడి పద్మాల నిర్మింపఁబడునొ యీమె ! 22

నలువైపు మంటల నడుమ గ్రీష్మాదిత్యు
తెప్పవేయక చూచి ధృతి జపించు
మండు టెండకు మోము పండి పద్మమ్మయ్యె
గాని నల్పెక్కెఁ గ్రీఁగన్ను మాత్ర.
పంచాగ్నులకు మాడి వాడి తొల్కారి తాఁక
యావిరి చిమ్మె భూదేవి తోడ.
పక్ష్మ ధరస్తన త్రికిఁ బైఁబడి ప్రేలి
బొడ్డు వాపిని నింపె మొదటి చినుకు,
గాలి వానలలో నల్లరాల పైని
బట్ట బయటఁ బన్నుండి తాఁ బడిన శ్రమకు
మెఱపుఁ గన్నులు విచ్చి లేమెఱుఁగుఁ బోఁడి
సాక్ష్యమనఁ జూడ నామె స్వేచ్ఛగ జపించె. 23

కోరక మె లభ్యమైన మేఘుని జలమ్మ
నమృత దేహుని కిరణమ్మ లనెడు రెండు
భుక్తిగా నొక్క వృక్షము బోలి మెసఁగి
నిట్ట నిలుచుండి జపియించు గట్టు బొట్టె. 24

మంచుఁ జిమ్మెడి గాలి మధ్యఁ జన్నీటిలో
మరలించె నటఁ బుష్యమాస నిశలు.
ఎడబాటుచే బంతబడి యార్చు కొను చున్న
జక్కవ కవఁ జూచి జాలిగాంచు,

హేమంతమున రేల దామరల్ ముకుళింప
గజగజ కొంలనులో గౌరి విచ్చు,
హిమ సరస్సున నాస్యకమల వాసనఁ జొన్పి
పెదవి రేకార్చి సవ్వించు నామె.

రాలు టాకులు తించు లీఁన్ జపించు
టవధి తపమున; కుత్కర్ష యదియ యండ్రు.
ఇవ్వియుం గూడ తినక జపించు నుమను
పండితులు పిల్చు చుందు "రపర్ణ" యనుచు. 25

తన శరీరము సర్వదా తమ్మితూటి
కన్ననున్ సుకుమారమే యౌను గాక.
అగ్ని జలములలో నెరలాట మాడు
వ్రతములఁ గృశింపఁ జేయుచు ప్రథితి కెక్కె. 26

దుష్కర తపస్సు నేయు వృద్ధులగు ఋషుల
కడిఁది తపమును దా దిగదుడుపు నేసె
నెంతటి తపస్వి యేని లజ్జించు చుండె
రే బవ ళ్ళహ రహమ్ము గౌరిని తలంచి. 27



## కుహనాబ్రహ్మచారి

ప్రణిధాన రస సమాస్వాదన లోలుఖుల్
యోగాసనముల నిరూఢు లైరి.
ప్రత్యూష కింజల్క భాగ్య భాగ స్వామి
గంధవాహుఁడు మెల్లఁగా ద్రవించె.
వేఁగుఁ జుక్కను లేప సాఁగెను "కొక్కొరో
కో" రవాళిని తొలి కోఁడిపుంజు.
కుంటి సారధి యుషః కోమలాంగి జటన్
సొగియుట సూచింపఁ జుక్క వొడిచె
అట్టహాసాల దొర మదిన్ కట్టివైచి
సృష్టి మరచి సుఖమ్ముగా రేఁబవళ్ళు
ప్రణవ నిధ్యాసమున మున్గు బాల కొకటఁ
జివ్వసం గ్రొత్త సొగసు వీచిన దదేమొ! 28

వ్రేలార్చె వీఁపుపై లేడి చర్మము సుట్ట
పాలాశ దండమ్ము గేల నిల్పె
ఆలపించెడి నుదాత్తా నుదాత్తాదుల
మాధుర్య మొలుక సామ స్వరమ్ము.
ఆలోకనము సందు నాభాషణము నందుఁ
బ్రజ్వలించెడి బ్రహ్మ వర్చసమ్ము.
"ఆకారము వహించి యరుదేఁ బ్రహ్మచ
ర్యాశ్రమమ్మా!" యన నవతరించు
ధీరుఁడ స్ఖలిత బ్రహ్మచారి యితఁడు
జటలు ధరియించి యంబికాశ్రమము చేరి
చెలులలో నున్న పార్వతి వల నెఱింగి
వడివడిన్ వచ్చె బుడిబుడి నడల తోడ. 29

"దయసేయుండు మహానుభావులు పవిత్రమ్మయ్యె మా తా వెదో
జయముం గూడిన యట్లు సంతసము నుత్సాహమ్ము రేకెత్తెఁ; ద
న్మయతన్ మిమ్ము గనంగఁ గోరు నెద. యీ దర్భాసన మ్మెక్కి మా
భయ భక్తిప్రచురా తిథేయతఁ గొసం బ్రార్థింతు"మంచార్యమై. 30

స్వాగత మంచెదుర్కొని సమర్పణ సేసెను కొండమల్లె లా
యోగిని. ధీరచిత్తుల కొకొక్కరి జూచిన సంతులేని వే
వో గురుతా నుభావములు పుట్టుక వచ్చుట సాజ మేమొ; బై
రాగి సమాన యోగి గదరా! ఉమ కెందుల కింత వీనిపై. 31

శాస్త్రోక్తమ్ముగ గౌరి సేసిన సపర్యం గాంచి మార్గ వ్యథన్
శస్త్రించెన్ క్షణ కాల మావటువు. విజ్ఞా నాక్త ధారాళతన్
నిస్త్రింశాయిత దృష్టితో నతఁడు వాణిం గల్పఁగా నెంచి మి
త్ర స్త్రీతో వలె మాటలాడె, నిటు పూర్వ స్నేహ మున్నట్లుగా. 32

"కుశలు దర్భాదికము దొరకును గదమ్మ!
స్నానమునకు లభించునా! స్వాదు జలము.
శక్తి మీఱి సల్పవు గదా! జప తపములు
ధర్మ సాధన మొక్కటే తనువు తన్వి! 33

జోతిం బోలిన నీదు చూపభినయించున్ లేడి చెల్లాయి. నీ
చేతంబట్టిన లేఁత దర్భ పరకల్ స్నేహమ్ముమై లాగి కొం
చూతం బర్విడు నప్డు నీ కనులలో హోమమ్ము గావింప కా
జాతిన్ చల్లఁగ జూతువా; క్రుథ తప స్సర్వస్వ దావాగ్ని సూ! 34

సౌందర్యమ్మున బుణ్య మబ్బునఁట. విశ్వాస్యము కాదేని నీ
యందమ్మం దిలకించుచున్ భవ దుపాధ్యాయిత్వ మర్థింతురా
వందారుల్ సురమౌని చంద్రులును; భావ త్కాతి సౌశీల్యతా
సంధానత్వము పుష్టిగూర్చెను ఋషీశాన ప్రపంచమ్మునున్. 35

సప్త ఋషుల పూజా పుష్ప సమితి కతన
నవ్వ చున్నట్లు ఎవినుండి నర్తనమున
గంగ ప్రవహించుటన్ కాదు కాని నీదు
తండ్రియు బితాళ్ళు నీ వల్ల ధన్యు లై రి. 36

ధర్మార్ధ కామములలో
మర్మ స్థల మొక్క ధర్మ మార్గమె యను నీ
"తీర్మాన" మర్మిలింతా
కర్మానుష్ఠాన సిద్ధి గను నీ సీమన్ 37

ఇంత గౌరవించి హృదయ మిచ్చిన మీకు
వటుఁడ నా ప రాయివాఁడ గాను
సప్త పదము లాడ సాప్తపదీనమ్ము
చెలిమి. అద్ది మనకుఁ జెల్ల దటవె! 38

కానన్ నిన్నొక చిన్న ప్రశ్నమున సింగారింపఁగా నెంతు నో
చానా! నేను బడుంగు బాపఁడను పో; చాదస్తముం జాస్తి: అ
జ్ఞానమ్మే యగుగాక నీ కిట రహస్య మ్మేమి లేదా: సమా
ధానమ్మున్ మెఱపించి నా హృదయ సౌధ మ్మెల్ల దీప్తింపుమా. 39

ప్రప్రథమ ప్రజాపతి వంగడము నందు
సంతరించితివి సౌజన్య జన్మ
మెం దెవ్వ రెల్లెంత నీక్షించుగాక స
ర్వాధి కైశ్వర్య భాగ్యమ్ము నీది
లోక త్రయా తీత సౌకుమార్య ప్రభా
శృంగార రాశి శరీర మబ్బె
భోగ సౌఖ్యంపు బువ్వలు తేనె లొల్కు వ
సంతమౌ వయసు నీ సొంత గలదు,

హృదయ దార్ఢ్యమ్ము నందు నీ కేమి కొఱఁత
సాటి గానని ధీ కింత లోటు లేద.
వజ్ర సంకల్పములు మనః ప్రాభవమ్ము
గుప్పిట నెసంగుఁ; దప మేలొకో ! లతాంగి ! 40

వాచా తీతము నీ తపో మధురిమ ప్రాయో చితాకార, మే
యే చింతల్ నిను తండ్రిగారి గృహ మం దేడ్పింప లే వెప్పు; డే
నీచుండున్ నినుఁ జేరి కోరఁ డవమానింపంగ, నెవ్వండు కే
ల్చాఁచున్ బుస్సల కోఁడె త్రాఁచు తలపై రత్నమ్ముఁసం గాంక్షమై. 41

చందమామయు జుక్కలు సందడించు
నిశ కనూరుఁడు రుచియింప నేరఁ డెపుడు.
నగల మోజున్న తొలి యౌవనమ్ము నీది
ముసలి వగ్గుల నారలు మోయ నేల ? 42

## భుజంగ ప్రయాతము

సురా వాసముం గోరుచో నింత యేలా !
సురల్ నీదు పుట్టింటి సుట్టాలు కాగా !
వరుం గోరి ఋష్కింతువా ? రత్న మెవ్డున్ !
వరుం గోరునా ! వాఁడె ప్రార్థించి చేరున్. 43

వరుఁడ న్నంతనె నీ స్ఫులింగ మయ నిశ్వాసమ్ము వీతెంచి నా
కెఱఁగించెన్ భవదీయ కాంక్షితముఁ గానీ ! నమ్మ లేకుంటి, నీ
వరణీయుండు త్రిలోక మందెచట కన్పట్టండుఁ; నీ వెన్నుచో
వరుఁడై దక్కక యందరాని ఫలమౌ పాపిష్ఠి యెందుండెడిన్ 44

సొంపు గలువలతో గుబాళింపఁ దగిన
నీ కపోలమ్ము లెల్లఁ జీకాకు పఱచి

పచ్చబాఱి జటల్ వ్రేలి వాడి యుండ
స్థాణువై చూచు వరుఁడు వజ్రంపు రాయి 45

పెక్కు నేమమ్ములకుఁ దెగఁ జిక్కినావు
ఎండలకు వాడె నీ సగలుండు తనువు
పట్టపగలిటి నెలవంక వంటి నిన్ను
కనిన మొద్దునకే రాద కంటి చెమ్మ! 46

భ్రుకుటి ధనువున దేటి చూపుల యలుంగు
బిగిచి హాసులు గుల్కు నీ మొగము గనక
తెఱ మఱుంగున దోఁబూచు లురవణించు
మోహనుండు సౌందర్యపుఁ బొగరు బలిసి
నష్టపడు చుండె నందు నందాల రాణి. 47

శృంగార ప్రమదా శిరోమణివి; యిం కెం తెంత కాల మ్మిటుల్
స్వాంగమ్ముల్ కృశియింపఁ జేయుదువు బాలా! బ్రహ్మచర్యాంగనా
సంగోపార్జిత మ త్తప స్సుకృతి నీ సంగోరునన్ వాని నీ
కొంగుం బంగరు జేసి; కొమ్మలని నాకుం దెల్పి కీర్తింపవా! 48

చదువుకొన్నావు బోలెఁడు శాస్త్ర మెల్ల
నిన్ను వైదుష్యమున బోల నేరఁ డెవఁడు.
నిన్ను మించిన వాఁడు కాన్పింపఁ, డేమి
కలిసి వచ్చును పో పెండ్లి వలన నీకు 49

"అసలు" గృహస్థ జీవితము నందున సర్వము నగ్ని గుండము౯
నసి యగు సౌఖ్యముల్ కసిమసంగిన గర్తలు; లేలిహానముల్
బుసలు వెలార్చు భీకరపు బుట్టలు సంస్కృతి కోర నేల! ఓ
కిసలయ మంజు కోమల! శుకీ కలభాషిణి! ఓ తపస్వినీ. 50

పరమాసహ్యము మర్త్య లోక నరకా ర్భాటాతిభీ హేతు సం
సరణ మ్మెన్వరు నీకు లెస్స యని నచ్చం జెప్పిరో ! కాని గ
గ్గురుపాశై యెద విహ్వాలించెడి భవా కూపారముం గన్న, సుం
దరి ! ఓ వక్రకచా ! యమాయిక పుం బుంతం బోక పర్దిల్లుమా ! 51

మరచితి మొన్న మొన్న నెఱపూ, గుసు మాయుధు మాడ్చి నాఁడఁటే.
పరమ శివుండ టంచు వినబడ్డది. యిం "కసలే" సుఖమ్ము సం
సరణము నందు నాస్తి. ఇట సంశయమే లొకొ ! యింక మీఁద నీ
చరితము సర్వ సన్న్యసన సౌఖ్యము నందును గాక నావలెన్. 52

దంపతులకుఁ బరస్పరా దర్శ మొకటి
యౌచు నద్వైత మదికిన నదియె దివము.
కాని నా డంతకన్న కక్కసపు నరక
బాధ మఱియొక టేదియు లేదు కాద ! 53

వేఱువేఱుగ పుట్టి వేర్వేఱ పెరిగి
కాము కతమున దనువులు గలుపు కొనెడు
నంతలో నెట్లు పొసఁగు నైక్య ప్రపత్తి.
పరమ శాశ్వతమౌ జీవ భావమునకు. 54

చదువు లేక పోషించుకో శక్తి యుడిగి
గచ్చకాయలఁ గాలము గడుపు కొనెడు
నాఁడువారలు సంసార మభిలషింత్రు "
యోగి వంద్యవు. నీ కట్టి యోగ మేల ! 55

భర్త యని వానికై తెగఁ బ్రాఁకు వార
లెల్లరును సౌఖ్య మొక్కటే నొల్లు కొనరు.
స్త్రీలు పనికత్తె లని, పతి తేఁ డటంచు
భ్రాంతి పడు భర్త లుంద్రు ప్రపంచమందు. 56

మనసు నరికట్టు కొనలేక మగలు తఱచు
బైటఁ బడుచుండ్రు పడఁతుల నీటు లరసి,
హృదయ పాతాళమును పెల్లగించి వైచు
శివుని తెఱచిన సెగకన్ను స్త్రీలకు నది. 57

గోముఖ వ్యాఘ్రములు సుమీ ! ప్రేమ లన్న
తేనె పూసిన కత్తి ధాత్రీ తలమ్ము,
ముచ్చి బంగారమును చూచి మోసపడిన
వేదనలు యాతనలు దక్కు పిచ్చిపిల్ల ! 58

సంసారమ్ము సుఖప్రద మ్మనుట ని స్సందిగ్ధమా : కా దటన్
శంసా మార్గము లేదు; దక్కుదువ యే "శచ్చోటి" కో, వాఁడు నిన్
హింసించున్, సహింప లేమది లతాంగి! పోని యెట్లేని నీ
హంసీయానము మెచ్చి నేనె నిను పెండ్లాడంగ, మేలే మొకో ! 59

పోనీ ! నీ హృదయస్థునిన్ వినిచి నన్ పోనిమ్ము. నా కేల యై
రాణల్; కన్యల లేని పోని గొడవల్. ప్రారబ్ధ మెట్లుండెనో !
ఏణీలోచన ! ఏమొ గాని నిను దర్శింపంగ నీతో నిటుల్
వాణింగల్ప, ననూహ్యమైన దెదియో భావమ్ము ప్రేరేఁచెడిన్. 60

ప్రణయమో, భక్తియో ! లేక, వత్సలతయొ,
దయయొ, స్నేహమ్మొ కాముకత్వమొ, మతేమొ !
గుర్తు పట్టఁగ లేకుంటి కుందరదన !
పోల్కి తెలియుట లే దిదే పూర్వకృతమొ. 61

తరుణీ ! రమ్ము పరస్పరమ్ము మన కద్వైతమ్ము సిద్ధించు; సౌ
ఖ్య రమా శాశ్వత రాజ్య మేలుదము. పో ! కాదందువా ! నీ మనో
హర బుద్ధిన్ విలసిల్లు శంకరుని పేరైనం బయ ల్వెట్టుమా !
చిర కాలమ్మున కేని యా స్ఫటిక రాశిన్ నీకు నార్జించెదన్." 62

అనుచు నుపన్యసించు వటు నందము వాటము చూచి చూచి యో
గిని గిరిజా మతల్లియు సఖిం దిలకించుచుఁ గన్ను సన్న సే
సిన యది, భర్తృ నామమును చెప్పఁగ సిబ్బితి ప్రబ్బె నేమొ ! ఆ
చనువునఁ జూచు సౌఖ్య సర సామిత భాషి నవీనుఁడున్ కదా ! 63

జ్ఞాన మను నగ్నితో గర్మ కాష్ఠ రాజి
తగులఁబెట్టులతాంగి కా తరుణి తేజు
చూచు మధ్యన నేదియోఁ జొక్కు తగిలి
వాని యేహ్యాపు నుడి వినఁబడఁగ లేద. 64

చెలి వర్ణిం దిలకించి యిట్లను "మహాశీలా ! వినంగా గుతూ
హలముం గల్గిన నేని యీమె మృదు దేహమ్ముం దప స్సిద్ధికై
జలజాతమ్మును నాతపత్రముగ నాచ్ఛాదించుటం బోలెఁదా
బలమౌ సాధన మేల సేసెనో మహాభావా ! వధానింపుమా ! 65

అతి దయా సాంద్ర హృదయ ! మా యాశి కొఱకు
బ్రహ్మచర్యా శ్రమమ్మును బలియొసంగ
దాము మా పట్ల జూపెడి త్యాగమునకు
నంజలింపులు శత సహ స్రార్పితములు. 66

ఈమె శచీ కళా విభవ మేత్తెర కావలిగట్టు మెట్టఁగా
గామన గల్గి నర్ధి గధికారుల నైతము లక్ష్యపెట్టకే
కోమల రామణీయకము క్రొందలఁగొట్టి మరున్ దృశాగ్నిలో
హోమము సేయు శంకర మహోదయు కౌఁగిలి కాంక్ష సేసెడిన్. 67

అల్ల రతిదేవి పగపు అంపిల్ల గాంచి
నది మొదల్ సఖి మృత్యుంజయ ప్రభునకు
నర్మిలిం జేసికొనియె నాత్మార్పణమ్ము.
అర్హతలు తారతమ్య మంత ర్హితముగ. 68

నారి లాగి బాణమ్ము మన్మథుడు వేయ
గరళ కంఠ కఠోర హుంకారమునకు
సడలి వెనుకకు వచ్చి యా యలరు చెలికె
గుండెఁ బాతాళమున దాఁక గ్రుచ్చుకొనియె. 69

అది మొదల్ తండ్రియింట నున్మదన వశత
ముదురు గందపుఁ బొట్టుపైఁ బొరలు కురుల
గరడు గట్టిన నెఱమంచు పఱపులందు
సైత మేమాత్ర మీమెకు శాంతిలేదు, 70

నిద్ర పట్టకపట్టక నిశను గొసను
పట్టినన్ వెంటనె యుల్కిపడెడి దీమె.
ఏ యెదకుఁ బోదు "నీలకంఠా" యటంచు
గౌఁగిలించును కలలోన గల్ల శివుని. 71

చంద్రశేఖరు ప్రతికృతి సవదరించి
"ఎల్లెడల నిండి యుందువఁటే ! వరించి
నీకయి తపించు నన్గన నేర నేల !
శంకరా" యని యూఱును చాటు చోట. 72

భవుడు పాటను వినంబడ నేడ్చు సఖిఁ జూచి
యిచటఁ గిన్నర కన్య లేడ్చు చుండ్రు.
పతిదేవు భావించి భావించి రేఁబవల్
జెప్ప వేయుటకు విస్మృతి ఘటిల్లు.
"నా వరించిన భర్త నా సొమ్ము మీ కంటఁ
బడియెనా" యని సిగ్గు విడిచి యార్చు.
తనగోల లతికల దరి జెప్పుకొని యొక
ప్పుడు మతి పోయి వా పోవుచుండు.

గౌరి దురపస్థ పట్ట పగ్గాలు లేక
ప్రేక్షకుల మైన మమ్మె మూర్ఛిల్ల జేయు.
ననఁగ నీమెను హతమార్చు టబ్బురంబె
ఇంత టంతట సడియు గావించుఁ గర్మ 73

మన్మథుని మాడ్చివేసిన మహితు మనము
లొంగునా ! పాంచ భౌతిక రూపములకు
దేవదేవుని శివు లొంగ దీసికొనఁగ
తపము దక్కిన వేఱొక దారి లేద. 74

శివుఁడు పతిగా లభింప మా చిట్టితల్లి
కింక వేఱొక్క దిక్కు కాన్పింప లేప
తల్లిదండ్రుల నొప్పించి తపము సలుప
వనము సేరిన దప్డు మే మనుసరింప.

వ్రతమునకు మున్న బీజముల్ పాఁతి పెనుప
సఖి తప స్సాక్ష్య మైన యాశ్రమ తరువులు
పండినవి గాని యామె తపస్సు మాత్ర
గొడ్డు వాఱెను కల్గ దంకురము యేని. 75

దుక్కి యయ్యు సనావృష్టితోఁ గృశించు
పొలము నింద్రుడు వోలె మా చెలికి నెప్పు
డెంత ప్రార్థింపఁ బడియు లభింప నట్టి
వరుఁడు దయఁజూచునో బోధపడుట లేదు 76

అని చెలికత్తె యా వటు నెడాటమునన్ హృదయమ్ము విప్పి యో
గిని చరితమ్ము సర్వ మెఱిగింపఁగ నా నిగమాంత తేజముల్
పెనఁగొను వన్నెలాఁడు "భళరే ! నిజమా ! పరిహాసమా ! కనుం
గొనవలె" నంచుఁ బార్వతి ననున్ తన సంతస మెల్ల దాఁచుచున్ 77

స్ఫటిక మాల ముంజేతికి సొరు లొలయ
కలువ మొగ్గల తీరు వ్రేళుల ముడిచి
పార్వతి విదిర్చె జాల సేపటికి సిగ్గు
తెఱ మఱుఁగున సిటు పల్కు తేనె బొట్టు. 78

ఉత్సాహ

"వేదవి ద్వరిష్ఠ! నీవు విన్న దెల్ల సత్యమే
నాదు కోర్కె పరమ పదము నాయకున్ వరించుటే
పేద తపము చాల దద్ది విలిచి కొనఁగ నైననున్
లేదు కాద కోర్కె లేఁగ లేని తావ దెచ్చుటన్ 79

తా మెవ్వారలొ మే మెఱుంగము మహాత్మా! వచ్చి నిర్హేతుక
ప్రేమాదామము కోరకించినటు నిర్భీక ప్రబోధమ్ముతో
మీ మైత్రిం గరుణించి నార లిటు మీ మేధా విశేషానకున్
స్వామీ! పల్మఱు మోఁకరించెద క్షమింపం జెల్లు నా వాక్యముల్. 80

రత్నము పదాఱువన్నె హొరంగు మీఱు
పసిఁడిని పరిష్కరించుట పాఁడి యైన
పసిఁడికి గవేషణా శక్తి వట్టువడమి
నిరువురును స్వర్ణకారు భజింపవలయు. 81

అందరాని ఫలమ్ముకై నఱ్ఱుసాచు
బోటి నబలను ఇది యెంతపాటి తపము
హృదయ నాథుఁడు సాక్షాత్కరించు వఱకు
వ్రతము విడను విడన్లేని పట్టునాది, 82

అవిరతమ్ముగ నా మహాశివుని నాకు
నెంత జపియించు కొందుమో యంతకన్న
వేఱొక యదృష్ట మేమి వివేకవతికి!
ఏటి కెదురీఁదు బోధ నా కేల నేతొ! 83

పొల్లు కల్లలు సెప్పి నా యుల్ల మెల్ల
గుల్ల సేతుమే మెదడెల్ల కొల్లఁగొట్టి!
అతి సనాతన మత మెల్ల సంతరంగ
మం. దెఱింగిన విద్వాంసురాల నేను. 84

సంసారమ్మును తూల నాడెదు, వశిష్ఠ ప్రష్ఠులున్ విష్ణుఁడున్
హంసాస్థానియు జ్ఞానహీనులని వ్యాఖ్యానింతురే! పుష్ప బా
ణాంస మెమ్మెండు వినాకరింప భవ సౌఖ్య మ్మెంతయుత్కృష్టమో
శంసింపం దరమౌనె! ఎంతటి మనీషా నాథ విద్వత్తమన్ 85

క్రొత్తదన మొత్తిగించి వాకొనిన మీఁద
యా విశేషమ్ము పల్కెంచె హద్దు మీఱి
తెలుఁగుమీఱిన నాదు భక్తి ప్రపత్తి
తేఱుకొని అద్ది సైచె అదృష్ట మిద్ది. 86

పతికిఁ బత్నికి భేదము పలుకు పట్ల
పత్నిలోని సకారమే బదులు సెప్పు
పురుష పరుషత్వమును సైచి సరళ గతిని
దిద్దుకొనఁదగు పో భారతీయ ధాత్రి, 87

మంచియు చెడ్డయున్ సరిసమానముగాఁ గల లోకమందు నీ
వెంచిన యట్లు సంసరణమే యొక పాపపుఁ గూప మౌనె, యీ
వంచన సేఁత నీకుఁ దగవా! భవవార్ధి మథించు కొన్న జ
న్మించు నటన్ సుధాకలశ మీవి మహీరుహ కామ ధేనువుల్, 88

మారుని చంపెనన్ పిఱికి మందులు పెట్టకు రుద్రు చిచ్చుతోఁ
బోరొనరించుచున్ విజయముం గను నాథు సమాధి బల్మి నా
మారుఁడు లేచి శంకరుని మంగళ సూత్రము ముట్టి దీవెనల్
గూఱిచి సేసఁబాల నొలుకున్ రతితో రతి మా శిరస్సునన్, 89

భవ మన నేమియో యనుభవమ్ము కలట్లు ప్రబోధసేయు నీ
జవమున కొక్క వందనము సర్వ సమర్థుఁడ వన్న నమ్మిగన్
తవిలితి పల్కులన్ తెలివి తక్కువ కూతలు వించు నిన్ను నే
నవలకు గెంటివేయ వలె నైన నదేలొకొ జంకు పుట్టెడిన్. 90

పతియును పత్నియున్ వెను భవమ్మున శేషము నేటి వారి జీ
వితము మయమ్మునన్ కలిపి ప్రేమము పెంచుక యారగింతు రా
జత యతుకంగ రాఁనుట సార్వజనీనము గాద దెందొ ! నా
కతగతి శంకరుం డెఱుఁగుఁ గాక ! యతండన నింత యేలొకో ! 91

ఇల్లా లంచును జీవితేశి యని దేవీయంచు నర్ధాంగి యం
చెల్లల్ మీఱు పసందు కల్గు పతి మాతృ క్షేత్ర మత్యంత ము
త్కల్లో లాశ్రయుడైన నాధునకు సౌఖ్య మ్మొల్కు లావణ్య సం
ప ల్లాస్యమ్ముల కాటపట్టయిన సౌభాగ్యమ్ము చేఁడొ నఁటే 92

శాంతమ్ముం జిలికించి సంసృతిని విజ్ఞానమ్ము కుప్పించి యా
చాంతా పార పయోధియైన ఋషి సంసారంపుఁ జేయూఁత ని
శ్చింతా సంత మహా విచిత్ర సుఖ రాశిం జూఱ గొన్నాఁడఁటే
కంతుం గొంతయు జీరికిం గొనని సౌఖ్యమ్మే మహాభాగ్యమౌ 93

కోటి యెలుంగు లెత్తి ఋషికూటము సృష్టికి గూటికోసమై
యీ టకటొంకు లోకమువ కేడ్గడ గమ్యము సూప ధర్మ శృం
గాటకముల్ శ్రుతుల్ తరచి కాంచి ప్రవృత్తి నివృత్తియన్ జగా
బాటలు రెండు సాఁచెను కృపాళురు వార లతీత లోకులున్. 94

ఆ శ్రుతిరథ్యలన్ దొరకి నట్టి యమోఘపు రెండు బాటలం
దశ్రమ సాధ్యమైనది మహా సుఖ దాయియు నైన దీ గృహ
స్థాశ్రమ మొక్కటే సుమి జయ మ్మగు నియ్యెద పుణ్య లోక ఘం
టా శ్రవణా స్పదమ్మగు గడాని భవంతియు ప్రేక్షకాళివై ! 95

ఈ భవంతికి జంటయే పంచి ముత్యాల
రంగవల్లిక లమర్పంగ వలయు
ఆ లోఁగిలే నిల్వు టద్దమ్ముగా సందు
విష్ణు లోకమ్ము సూపింప వలయు
అభ్రంలిహా గ్రమౌ నా హర్మ్య మందెక్కి
యొక సత్య లోక మందుకొని వలయు
ఆ హజారమ్ములో నా హౌసు మువ్వన్నె
బావుటాంశ లమర్పంగ బడును
అతి దయారస మజ్జిత మ్మైన సత్య
శాంత్య హింసా పరీతాప షాడబమ్ము
ధార్మిక రసాయన మ్మన్న దది పునాది
గాఁ బ్రవర్తిల్లుఁ గావుత కాఁపురమన. 96
దారి టోయెడు వారికి ధర్మశాల
బాట లెఱుఁగని వారికి పాఠశాల
పరమ రోగులకును ధర్మ వైద్యశాల
గా భవంతిని మెఱయించుఁ గాక జంట. 97
ఉభయ వంశస్థుల నుద్ధరింపగఁ దగ్గ
భాగధేయత చానకే గల దిట
సౌశీల్య వతుల సంసార మాముష్మిక
నిశ్రేణి యగు మహదాశ్రమమ్ము
వీతిహోత్రుండు దీవించు గల్యాణమ్ము
ఘంటాపథమ్ము మోక్ష ప్రవృత్తి
వైవాహికీ మంత్ర భావ కళాతి పా
లనము పో ముక్తికి రాచబాట.
దేవు మృత్యుంజయుం బతిగా వరించి
భారతీయ పురంధ్రీ ప్రభావమునకు

మెఱుగు వెట్టెద నా దర్శ తరుణి నౌచు
ధర్మనిష్ఠకు భీతిల్లు కర్మ మేల? 98
ఒడి దుడుకుల పట్లఁ గుడి యెడమలు లేక
గృహము శోధించి సేవించుటకును
సంసార సామ్రాజ్య సార్వభౌముం డైన
పతి కుత్తమాంగమై వఱలు కొఱకు
పతికి గారమ్ముగా నతి ధార్మికము లైన
నెనరు భోగ్యాలు తిన్పించుటకును
హృదయమ్ముపై మృగీ మదము సింగారించి
యధరా ర్పణాపసరా దులకును.
దాసియై మంత్రి యౌచును తల్లి యగుచు
పతి కొఱకు మీఁదుగట్టిన బ్రదుకు వెలయు
మహిషి వెలయు గృహస్థాశ్రమము నివృత్తి
నెక్కఁగా ముందు మెట్టంచు నెంత్రు బుద్ధులు. 99
తపము మెచ్చుచు ధాత దౌర్భాగ్యులకు జగాల్
దుమ్ములో గలియు వరమ్మ లిచ్చు
అర్హతా నర్హత లరయక దేవేంద్రుఁ
డాజ్ఞాపనలు సేవ కాళి కిడును
మంచి చెడ్డలు విమర్శించక ముక్కంటి
ఎదుటి మొవ్వులనె దహింపఁ జేయు
కచ చూచుకము లందు కిచకిచల్ చిలికించి
గొల్ల కన్నెల యొడల్ గిల్లును హరి.
ప్రేమ వైచిత్రి నీవు గుర్తింతె! అద్ది
లైంగికా లైంగికమ్ముల బ్రబలు రెంట
లైంగికము పాశవిక మానుషంగిక మట
భంగ మెఱుగని శుభమ హార్రంగు లేదు. 100

లైంగికము గాని రెండవ ప్రణయ మందు
చేతనా చేతనాంతర చింత లేదు
కోఁడె త్రాఁచును ముద్దిడికొను శివుండు;
మేఘుఁగని పురి విప్పు నెమిళ్ళు లేవె! 101

ప్రణయ తత్వార్థమునకు నిర్వచనముగను
దంపతి పదార్థమునకు నాదర్శముగను
జ్ఞాన సంస్కృతి కేను వ్యాఖ్యానముగను
సర్వ మాంగళ్య జన్మము సంతరింతు

అండ్రు "కార్యేషు దాసీ" యటంచు, కాని
మదిని తలఁపరె " కరణేషు మంత్రి " యనుట
బాధ్యతలు గౌరవాల్ కల భార్య లేక
మంత్రి లేని రాజ్యమ్ము సంసార మనిన. 102

వెన్ను డొమ్మారి భార్య నవ్వించు, నలువ
రసనపై కెక్కె వాణి గారాలు కుడుచు
చంద్ర శేఖరునకు మాత్ర సరసముంకు
ప్రేయసీమణి వంచచే వెట్టికుట్టు.' 103

అన నను బ్రహ్మచారి వహవా! శివు నెవ్వ రెఱుంగ రిందు; నే
ననుకొని నంతయైనది సుమా! పరిభావిత వయ్యు వానికై
పెనఁగుట సిగ్గు సిగ్గతఁడు పెద్ద యమంగళ మూర్తి యిద్ది నీ
జనకుఁ డెఱుంగునా! తన దెసన్ శివుఁ డల్లుఁడుగా రుచించునా! 104

వేసము నివాసమున్ సహ
వాసులును వసాన మట్టె వారువమున్ సే
బాసు బలే, వరు సిరి. పరి
హాస రసా భాసములకు నైక్యము ప్రబ్బెన్. 105

మర్త్య లోకమునందు పుట్టి ముద్దుల మధ్య
పుట్టుటయే మొట్ట మొదటి తప్పు
పుట్టితో! కష్టాల పుట్టయౌ స్త్రీ జాతి
ప్రభవించుటనఁ దరువాతి తప్పు
ప్రభవించితో! మహా పాతకములు గంతు
భవ వార్ధి కాంక్ష యౌ పైని తప్పు
పోషింపఁ బడుగాక గర్భ దరిద్రుని
ముద్దు లాసించుట పెద్ద తప్పు

ప్రియపు జేరాలి రెంపక పెండ్లి కొడుకు
తాళిపై నాస తప్పుపైఁ దప్పు తన్వి
హేషమాణ జుహూరాణ దృశ్యమాన
జీవిత మ్మభిలషింపుమా చిగురుఁబోడి. 106

కాంతి వెదజల్లు జంద్ర రేఖయును లోక
మోహనమ్మైన నీ జగా ముద్దు మోము,
ఈ దరిద్ర ముఖ మ్మాశ్రయించు టరయ.
జాలి పొరలాడు నెంత కసాయి కేని 107

చలువ రా పూశయ్య చరియించు బారాణి
పదములు కాఁటిలో మెదలఁ దగవు
కలహంస చిత్రాలు కల పట్టు జీరను
రక్తపు గజచర్మ రాయ తగదు
పెండ్లిఁ గంకణములు వెలయు పాణికి పాప
కడియాల కే ల్పొందు వెడఁగుఁ దనము.
శ్రీచందనము గుబాళించు బాలిండ్లపై
కాఁటి పీనుఁగు బూదె కాదు పూయ

దిగ్గజమ్ము నధిష్ఠింపఁ దగ్గ నీవు
గంగిరెద్దెక్కి బాట నేఁగంగ జూచి
సవ్వరా ! లజ్జ యింత కన్నన్ మఱేమి !
పిచ్చి యెత్తెనె ! ఏల యీ వెఱ్ఱితనము 108

నే నన్నా; నని కోపగింపకుము ! దేవీ; కట్టుకోఁ దగ్గ బ
ట్టైనన్ లేని దిగంబరుం డనుదురే హాస్యోక్తి కా దద్ది నీ
నీనుల్ విన్నవొ లేదొ ! తిండి యెటకున్ బిచ్చమ్ముకై పోసిచో
లేనే లేదట; పుఱ్ఱె పాత్రము "కపాలీ !" యందు రద్దాననే ! 109

నిదుర పోవుచునుండు నుదుటి వంకర కన్ను
ముఖముస కేహ్యాత్వమును ఘటించు
జననీ జనకు లేరొ జన్మ స్థల మ్మేదొ
ఎప్పు డెచ్చట పుట్టె నేరికెఱుక,
బికిరాల మారియై పెనఁగు లాగుట గాని
యక్షరా భ్యాస మైె సట్లు లేదు.
గోఁచిపాతయుఁ బూరి కొంపయు లేని ది
గంబరిత్వము చాటు సతని సిరిని.

తల్లి వాంఛించు ధన మేని, తండ్రి కోరు
విద్య యేనియో, కన్య గర్వింపఁ దగిన
రూపమేనియో, బంధుగుల్ కోరు కొలము
యేని, కలదొక్కొ; నీవు వరించు దొరకు. 110

కాఁటి బూడెద బుస్సన్న కౌఁగిటికిని
మంగళ ప్రదమైన నీ యంగములకు
పోల్కెయే లేదు. తగద టుమ్ముటికిబుద్ధి
కైకొనరు హోమసమిధగా గాఁటికొఱవి, 111

కరభోరూ ! నవ యౌవనార్భటము భాగ్య మ్మెల్ల సట్టేటిలో
బురదన్ ద్రొచ్చున నూబిలో దిగఁబడం బోవం గనుల్ కట్టి యీ
నెరసుల్ నీపయి రుప్పితిన్. చిగురుఁబోఁణీ ! కీరవాణీ ! నెఱా
దురుసుల్ నా నుడు లైన నీ కెటులు నా క్రోవేతువం దిక్కగున్. 112

పదిపదిం దిట్టి పట్టి కొట్టుదువు గాక
అజ్ఞురాలవు నీవు. సర్వజ్ఞుఁ డేను.
శలభ మగ్నిని బడఁ జూచి సైపనట్లు
భవ దవమ్మునఁబడు నిన్ సహింపన నవోఢ. 113

జగ దాధారుఁడు నిత్య సౌఖ్య లహరీ సర్వస్వ నాధుండు శ్రీ
నిగమాంత ప్రతిపాద్యమాన సుషమా నేత్రుండు ముక్కంటి కీ
నగలున్ నావెములున్ నవోఢలు జనానా లందులావణ్యముల్
సొగటాల్ హౌసులు దబ్బరల్; సొగసు వాల్చూపుల్ నెఱా సెబ్బరల్ 114

నేఁ దప మ్మెల్ల వెచ్చించి నిన్నుఁ గాఁపు
పెద్దగాఁ జేతుఁ బ్రాయోప వేశమేని
అవసరమ్మైన నేన పెండ్లాడ వలయు;
లేదు కాద పరోపకా రాధికమన 115

వణఁకు బెదవిని తాండవించినది కనుక.
కుటిల కుంచిత మయ్యె భ్రూకుంన లతిక
చింత బిచ్చగు గన్దోయి చెంగలించి
వక్రిత మ్మయ్యె; గౌరి కా వడుఁగు కతన. 116

బుడిబుడి బడుఁగు లెడంగా
గడబిడ దడ బడెడె నూసుఁ గారించుటకా !
వడివడిఁ గొంప మునింగిన
నడువున జేరుకొని నావు శ్వాసము లణఁగన్. 117

మతికరి మెతక వడుంగా
బ్రతుకున కుద్ధారకుండు పరమేశ్వరుఁడే
మతిఁ జెఱచు జెడగరమ్ములు
కతికి యతికి కుతుక వతుఁ కత మార్చెదవా ! 118

పురహరు చరిత మెఱుంగఁగ
దరమా ! కుబవాని కిందుధరు వృత్తాంత
మ్మఱచేతి యమృతఫలమా
పురాకృతము పల్కుమారి మఱెయుట కాదే 119

ఎవ్వ రీవృక్షు లందు తాదృశలు నేరి
కోరి వరియింపఁ ఎగిన శృంగార వీర
లాభముల్ వక్కాణింపు ! కల్యాణి ; ఇంక
మెదడు రెచ్చించ కీవు నా పదము వినుము, 120

అత్యావశ్యక సశ్వరమ్ము లిల దృశ్యాల్ పంచ భూతాత్మకాల్
సత్యాభాస విషాద పుచ్ఛములు. సంసారమ్ము నిశ్రేణి త
త్సత్యానంద మహా జగ జ్జిగమిషా సౌందర్య జీవాళికి
ప్రత్యేకాశయ వల్లి మాదృశల భావ మ్మందు బుష్పించెడిన్ 121
నన యొండు లోనైన నయన కహ్లార ము
త్పాటించి పూజించె భవుని హరియు
శివనాట్యమున జాఱు చితి భస్మ ముక్కోటి
దేవతలున్ శిరసా వహింత్రు
చౌదంతిపై వచ్చి సాష్టాంగపడు నింద్రుఁ
డెద్దెక్కి పోవు మహేశ్వరునకు
ఆత్మ భూజన్మకునైన హేతువు శివుం
డన్నచో శివు జన్మ సరయు టుల్లు !

వాదముల బనిలేదు; నా భావ భర్త
శివుడె నీవెంత కంఠము చించు కొనిన;
శివుని సింగారమొండె రుచించు నాకు
జగమునకు జంకు నొక్క స్వేచ్ఛా ప్రవృత్తి. 122

ఈశుం డెంత దరిద్రుఁడైనను సతండే సర్వ సంపత్ప్రభుం
డీశుం డెల్ల జగత్ప్రభుండు మనసంబే కొంపయౌ గాక; త
త్ప్రాశస్త్యాశిష మొక్కఁడే జగముకల్యాణాలు పండించు; స
ర్వేశుండెందు నమంగళుం డనుట వింటే పాప మెవ్వారికిన్. 123

అక్ష రాభ్యాస మైన లేదందు గాని
ఇతఁడె సర్వజ్ఞుఁడంట విన్పింప ఉపవె
అవ్యయుఁ డనంతుఁ డజుఁడు ననాది వాని
కక్షరా భ్యాసమున కిందు దక్షుఁ డెవఁడు! 124

శివ యథార్థ్యము తత్స్వరూపమును వర్ణింపంగ శక్యమ్మె ప
ట్టు వసానాల్ గజ చర్మ మట్లు కనుపట్టున్ త్రాఁచుపాముల్ మహా
ధవళా లంకరణమ్ము లొక్కటిగనే తారాము, తాల్చున్ కపా
ల వరిష్ఠమ్మను కంచమ; ట్లయినను ప్రాభవ్య మవ్వానిదే. 125

ప్రేమ గ్రుడ్డిది యంచు వర్ణింత్రు గాని
దాని యొడలెల్ల కలవు నేత్రములు వేయి;
అట్టి ప్రణయాన శివున కర్ధాంగి నౌచుఁ
బెంచు కొందు బాలిచ్చి విరించి సృష్టి. 126

గజ చర్మ ముడిపి బంగారు పుట్టమ్ములు
కట్టింపఁ గలఁ గఱకంతు చేత
వల్లకాఁటిని దాఁటి ప్రభుఁడు నా సొరుచేఁ
గైలాస సౌధాల గాఁపురించు

నతిలోక సౌందర్య మైన యర్ధాంగి కా
ట్రాఁచులు మంచి ముత్యాల సరులు
ముష్టి కపాలంపు ముద్ద నాదు సుమాళ
మునకు సుధా ధార ప్రోపు వెట్టు

ఆత్మభూ భస్మముం గన్నులార గాంచి
నది మొదల్ వజ్రి తపమువఁ బదిలపడుట
వ్యర్ధమా! శచీ వాక్కు నిరర్ధకమ్మొ!
బూటక మ్మొనె! ఆకాశమున వచస్సు 127

"ఓసీ! చెలీ! వటుం డిట నెదో మఱి నా కొఱకూసు లాడఁగా
బో సధరోష్ఠ మెల్లఁ గదుపున్; మెడఁ బట్టి జరీన గెంటు మీ
కూసును; పెద్దలం గుఱిచి కూసెడు కూఁతలు విన్న వారికిన్
దోసము, పోనిగెంట కతిథుల్: మనమే యిటనుండి పోదమున్" 128

అనుచు బాలిండ్ల జాఱు బైఁటను సడల్చి
మొగముఁ జిట్లించు కొనుచుఁ బోఁబోవు చుండ
నుమకు సాక్షాత్కరించె నా వ్యోమకేశుఁ
డత్యధిక దివ్య సౌందర్య మధిగమించి. 129

"త్రాహి క్రోధం ప్రభో సంహర" యని నాడు
గోలఁబెట్టిన పెద్ద కంఠాల వారు
పారిజాత ప్రసూన మందార గుచ్ఛ
మాలికా వర్షులై నేఁడు తేలినారు. 130

మత్తకోకిల.

సుందరాంగిని సిగ్గుసుందరి చూఱగొన్నది; కావుటన్
ముందు కేఁగఁగ లేక వెన్కకు బోవ లేకయు నక్కజ
మ్మంది పర్వత మడ్డగించు మహాపగా గతి నాగె నా
యిందు శేఖరు చంద్రికా స్మిత యే పదమ్ములఁ జూచుచున్ 131

నేఁటి నుండియు నిశ్చయమ్ముగ నీకు దాసుఁడ సుందరీ !
మేటి నిష్ఫల కమ్ముకొంటిని మెచ్చి యిచ్చితి మేను. ము
క్కోటిదేవత లెల్లరున్ గుమిగూడి మ్రొక్కెదు రెప్డు మి
న్నేటి కన్నె కిరీట మౌనిఁక నీ కటం పరఁ డాడఁగా 132

చెఱకు విల్కాని భస్మీభూతమౌ నాటి
బాధ నేటికిఁ బటాపంచ లయ్యె
రతి విలాపమ్ములో హుతమైన యువ మతి
నగ్నిహోత్రమ్ము చల్లారె నేఁడు
మండు టెండలలోన జండ భానుని తోడ
రాపాడి తపియించు శ్రమము సమసె,
గజగజగా మంచు కారు కాలాన ద
పించిన వెత యెల్ల పిలుకుమాఱె.

తల్లిదండ్రుల మాట కాదని లతాంగి
యేఱువార్చు కష్టమ్ము గట్టెక్కి పోయె.
గోర్కె ఫలియించుచో నగ్ని గుండ మందు
మాడిన శ్రమమ్ములున్ మటుమాయ మగును 133

శ్రీ గౌరవ పాత్రాతి
ప్రాగల్భ్య ! ముముక్షు కవి జవాది పరిమళ
శ్రీగుణ కల్పజనీ !" "వం
దే" గోవిందాపదాన నికష గ్రావా ! 134

ఓం

# తురీయాశ్వాసము

శ్రీ స్మేరాస్య సవిస్మయ
సస్మిత దృ గ్దృశ్య సంసిషాభయిషువు నా
కస్మిక సిద్ధు నొసర్చు మ
హా స్మృతి పథ దేవ! హనుమయా! వినుమయ్యా!

**ధర్మపాలనము :**

"తల్లి దండ్రుల కెట్టి సంతతి కతాన
సుకము కల్గదొ యద్ది పశు ప్రియమ్ము
కూడ కాదని నాకు బల్కుటకుఁ దగిన
యాజ్ఞ గైసేయ శంకరా ప్రాంజలింతు.! 2

నను నావారలు ముద్దుఁజూపు పదిసంధ్యల్ దాటి పోగా నటే
చనియెన్ రోజులు నాల్గు వారు నను శిక్ష వ్యాపృతిం బెంప నెం
చును నీ మీఁదట నా మనమ్ము "[illegible]కోజున్" వారి పాదాల గుం
దనపుం బూవుల పూజ సల్పఁగ మహా ధర్మ మ్మిదే కాదటే. 3

మలదుర్గంధము మూత్రకశ్మలత శ్లేష్మమ్ముం దసహ్యమ్ములున్
జలుబుల్ రోఁతయు వాంతు లేహ్యమును నిచ్చల్ సైచి ముద్దాడుచున్
పలు బాధల్ పడి జీవితమ్మునకు విజ్ఞానార్జ నార్థమ్ము వి
ద్యల నేర్పింపఁగ నష్ట కష్టముల లోనౌ వారు సామాన్యులా? 4

గ్రహ బాధాళియు దృష్టి దోషములు కార్కశ్యమ్ములున్ మృత్యు వో
ర హతా ద్రౌద్ర విజృంభణమ్ములు రుజార్భాటమ్ములున్ లీలఁగా
సహియింపన్ సుసుతా విధానమును వాత్సల్యాగ్ని మంత్రమ్ములున్,
వహియించుం గద, అట్టి జంట ఋణ మార్పన్ శక్యమే యేరికిన్. 5

ప్రాణమునకుఁ బ్రాణముగా జ్ఞానమ్మిడి పెంచి తా మొకానొక ధిషణా
మాణిక్యమునకు సుత నొక రాణిగ నమకూర్చు వారు లాతుల తులయే.

తల్లి దండ్రుల పట్ల గృతజ్ఞ బుద్ధి
నిలిపి న న్నుద్ధరింపఁగాఁ గొలుతు నిన్ను
నిత్య మగు నిద్ది సార్వజనీన నీతి
తల్లిదండ్రుల చరిత క్రొత్తయె మహాత్మ. R.C. 7

కుడి యెడమల్ తలంపక తిరోముఖ పేశల మైన శైలి నొ
త్తిడి సడి సుంత చూపక ప్రతిక్షణముం గనిపెట్టుకొంచు నే
ర్పడిఁ దడబాటులేక యువరాజువలెం గనురెప్పఁ రీతిఁ బ్రే
ముడి ముడివైచి ప్రోచిన విభుల్ తలిదండ్రు లనంగ మాటలా! 8

ఇరువురి యందుఁ దల్లి కడు హెచ్చు; గురుత్వము దాల్చు; నామె దు
ర్భర చరిత మ్మనూహ్య మపురా! నవ మాసము లొక్క జన్మ; మా
పురుటి కథా తిబాధ కఱుపుల్ కడు ఘోరము; వాని నైచి నన్
ధరణిని వైచినట్టి నెఱదైవము సాక్షిగఁ దాళిఁ గట్టుఁడీ. 9

పెంచుకొందురు పో ఫలాపేక్ష లేక
చచ్చిచెడి తల్లిదండ్రు లీ సంతు నెల్ల,
నీవు సర్వజ్ఞుఁడవు కాని దేవదేవ!
తల్లిపాలెఱుంగని దైవ మీవు. 10

"అమ్మ" పదమునఁ గల్గు తియ్యం దనమ్ము
"అమ్మ" యందలి మాధుర్య మరయ లేఁడు,
పెంపఁ బడలేదు! జగ మెల్లఁ బెంచుకొనును;
బాల్య మెఱుఁగని విభుఁడు మా బావగారు. 11

నను గన్నట్టి మహానుభావు లనుసంధానింపఁ బాణౌకృతిన్
నెనరాసం గన ధర్మ, మిర్వు రను సంధింపంగ వారర్హు లీ
మనలం గూరిచి వారు ధన్యులయి సంబాళింత్రు వంశమ్ము; కా
నన మందియ్యెడ మాఱుమూల మన కానందమ్ము రాణించునా! 12

అన్యోన్య మొక్కటై ధరిత్రి కొక ప్రేమాదర్శ పారమ్ముగా
ధన్యత్వమ్ము గడించికొందము, మహాదాంపత్య ధౌరేయ మూ
ర్ధన్యత్వమ్ము వహింత; మార్యుఁడగు మా తండ్రిన్ జోహారించి యీ
కన్యాదాన ఫలమ్ము నాతని కనుగ్రాహ్యమ్ము సర్వేశ్వరా ! 13

అతని కాస యిచ్చి యలకాధిపతి తోడఁ
దరలి రండు; మీకుఁ దగిన రీతి
సర్వ పాలకునకు పర్వతేశానుండు
కన్య నిచ్చుకొనును కాళ్ళు కడిగి. 14

మంచి చెడ్డ లెఱుఁగు మర్యాద లెఱుఁగును,
తారతమ్య మెఱుఁగు తండ్రి యతఁడు,
తనయఁ ధనియఁజేయ దక్షుండు మా తండ్రి
దక్షు నట్లు గర్వ పక్షి గాఁడు.” 15

అనుచుఁ జెలికత్తె నోట మాటాడె గౌరి
తహతహ కతానఁ దన పరాత్పరుని తోడ
ఆమనిం గొమ్మ కోకి లాస్యమున పలికి
కులికి విలసిల్లు సౌమ్యము వెలయు నట్లు. 16

## సంఘాతలు :

అదితి ప్రాణ సఖుంను, శ్రీమ దనసూయా ప్రేయసుండున్,సుశీ
ల ధవుం, దల్ల కుముద్వతీ ప్రియుఁ, డహల్యాజాని,శ్రీ రేణుకా
హృదయాధీశుఁ, డరుంధతీ పతి, మహర్షి శ్రేణి విస్వీథి నుం
డి దిగన్ మంజుల సామగాన లహరీ డిండీర భాండారమై. 17

కశ్య పాత్రి భరద్వాజ కౌశికులును
గౌతముఁడు గండ్రగొడ్డలితాత తండ్రి,
శ్రీ వశిష్ఠుఁడు నను సప్తఋషులు దిగిరి
ప్రథిత గమకాల సప్త స్వరమ్ము లట్లు
శంకర స్వామి లోలోన సంస్మరింప. 18

కౌదపు దిగ్గజ మద ఘుమంఘుమల జిమ్మ
కల్పపుష్పాలు హల్లీసకమ్ము లాడు
గగన గంగానదీ తరంగాల మునుఁగు
ఋషులు ప్రత్యక్ష మైరి మహేశ్వరునకు. 19

**ద్విపద:**

ముత్తెంపు జన్నిదమ్ములు దాల్చినారు.
పుత్తడి సాలువుల్ మొలఁ గప్పుకొనిరి.
రతనాల జపమాలలను గేల నంది
అచ్చ వానప్రస్థ మాశ్రయించు కొని
ఇచ్చ వచ్చిన కల్ప వృక్షమ్ము లైరి. 20

సవిత గుఱ్ఱాలఁ గ్రిందుగా సాఁగ నిచ్చి
రథము కుంచించి జెండా మలంచి వంచి
అఱ్ఱు పైకెత్తి మ్రొక్కి తారాధ పలయుఁ
ఋషులు ప్రత్యక్ష మైరి మహేశ్వరునకు. 21

**ద్విపద:**

ప్రళయమ్ము నందేని వసుధ చెంగటనె
అల మహాక్రోడ దంష్ట్రాంతర మ్మందు
విశ్రమించెడి ఋషుల్ వెలిసి నారెచట
విశ్రుతుల్ ఖావిలోఁ బెద్ద స్రష్టలఁటె. 22

శ్రీచిందు తప మెంత సిద్ధించుఁ గాక,
పూచి కాచి ఫలించి మోడెక్కుఁ గాక!
తనివి తీరక సదా తప మొనరించు
మునులు విచ్చేసి రా ప్రోడ సన్నిధికి. 23

నభము మెఱయించి వచ్చు చున్నట్టి వారి
మధ్యఁగా నొక్క సాధ్వి చమత్కరించె,
కన్నుకమలాలు పతి పాద కమలములను
కౌఁగిలించు నరుంధతీ కాంత యామె. 24

స్త్రీ పుంసాది విభేద దృష్టి రహితుల్ శ్రేష్ఠుల్, మహేశాసుడా
యాపెన్ మౌనులతో సమానమగు మర్యాదన్ సమీక్షించె, ను
ద్దీపించెన్ ఋషి మధ్య నామె గనఁ బత్నీ వాంఛ భస్మీకృత
శ్రీ పుష్పాస్త్రునకున్, సుపత్ని పురుష శ్రీ హేతు సర్వస్వమౌ. 25

"మా వేద జప హోమ కేవలత్వమ్ములు
నేఁడు గదా ఫలించినవి కనుట,
లోకేశు లందక శోకించు నీ మనః
పీఠాన మమ్ము నిల్పితివి భళిర!
ఎతనిలో నీవుందు వతనిది గొప్ప, నీ
కోరుట గొప్పపై గొప్ప మాకు,
తప నామిలకు మించు తా "వసల్" మాది నేఁ
డున్నతో న్నతము నీ యూహ కతన
నీవు మమ్మిట్లు తలఁచిన నెమ్మి కల్మి
మా మహిమ లోఁతు మే మానలే మయితిమి,
పెద్దలకు నచ్చుటయె తన పెద్దతనము
కోటి కెక్కిన దనుటకు గీఁటురాయి. 26

ద్వి ప ద :

నీ దర్శనమున మా మోద మెంతటిదో!
మనవి చేయుట లేల! మన సంత నీదె,
ని న్నెంత చూచిన ని న్నెఱుంగ మయ!
తెలుపుము నిను నీవ ధీ విమారుఁడవు. 27
మూర్తి త్రయాత్మక మూర్తి వీవు గద
కర్తదో భర్తదో హర్తదో మాకు
ప్రత్యక్ష మైన యీ భాగమ్ము నేఁడు
సత్యమ్ము నెఱుఁగ మో జాహ్నవీ శీర్ష. 28

ఎంత కెంతేని గ్రహింపఁగా రాని
దింతలో మా మతి కెల్లెక్కఁ గాన
ఈ ప్రశ్న వదలి మ మ్మేల రావింతొ
క్షేపమ్ము సెలవిచ్చి శిక్షింపుఁ డనఁగ. 29

"నిర్లిప్తుం డవ నిరాశ్రయుండవ ననుసంధింపం బ్రపంచమ్ములో
దౌర్లభ్యమ్ములు నాకు లే వనుకొనం జాలున్ శరీ రాష్ట కాం
త ర్లీనార్థము, లోక సౌఖ్యముల కస్మాన్ సాధ్య మే ముండెడిన్
స్వర్లోకేశ ముఖార్త నాదముల సంభావింప వద్దా ; ఋషుల్. 30

దప్పికఁ జిక్కి సొక్కి జలదమ్మును మ్రొక్కెడి చాతకమ్ములై
యుప్పెన ముప్పునం బడి "మొఱో" యను జీవులు వోలె రాక్షసు
గుప్పిటఁ బట్టఁగా సుర "లలో" మని చిక్కని మాసటీని నా
జెప్పను బో ల్దణాయని పొరిందారి కోరి రుదింత్రు వేసటన్, 31

తాదృ గ్భండన సింహసంహనన మూర్ధన్యున్ సురానీకినీ
నాథున్ శ్రీ హిమవ త్సుతా ప్రణయ సంతానమ్ముగా నేను నే
నై దైవాజి సృజించు కోసర మవశ్యా యాద్రిజన్, యాజకుల్
సాధింపం దగు నగ్నికై యరణి కాష్ఠ మ్మట్లుగాఁ గోరుదున్. 32

యాచింపన్వలె నేనుగాఁగ దుహినాహార్యాగ్రణిన్ మీరు మీ
వాచస్పత్యములన్ వెలార్పఁ దగు; సంభావించి యుష్మాదృశుల్
"పూచీగా" నగు జంటలో విటతటంబుల్ పాదుకో జాల వా
లోచింపం దగ; దా మహాత్ముఁ డతి కల్యుం డన్ని లోకమ్ములన్. 33

ఆదుకొని మీర లేఁగి కల్యాణ కార్య
కారులై రండు; ఆ మహా ధీరు తోడ
పల్కఁదగు పల్కు మీకు జెప్పంగ వలెనె!
మీ వచస్సే కదా ; సర్వ దేవ రక్ష. 34

స్ఫటికాకార యరుంధతీ సతియు మీ ప్రాపై జగా పాత్రగా
నటియింపందగు; పెండ్లికార్య మనుసంధానింప ముత్తైదువల్
పటకాలన్ హావణించు కొంచుఁ దటకా పాటొందగాఁ జేతురే!
ఘటనా పాటవ చాకచక్యపు టయస్కాంతాలు కాంతల్ కదా! 35

ఏఁగి శుభము తెండు, ఈ మహాకోశీ స
దీ ప్రపాతమునకు తెమిలి రండు,
"భేషు" లొల్కునట్టి, ఓషధి ప్రస్థమ్ము
రాజధాని శైలరాజున కన. 36

గంగోత్తంసము కోదెత్రాఁచు జట సింగారించి పాదోధి నై
షంగ స్వామియుఁ బెండ్లి బేరముల కుత్సాహించె నంచే సతీ
సాంగత్యమ్మున మౌను లేని నపలా సయ్యాటకున్ లొంగి రన్
బెంగన్ సిగ్గును వీడినారు తమ పెండ్లిన్ లోన నగ్గించుచున్. 37

## సంధానము

అమరావతీ పురీ రమణీయతను ద్రొక్కి
యలకాపురీ శోభ నతకరించు,
చదలేటి పరిఖ; వజ్రమ్ముల ప్రహరీలు;
లోన నోషధి లతల్ హొయల మెఱపు,
కొదమ సింగపుఁ బిల్ల గున్న యేన్గు పసాటి;
ఖనిజమ్ము లచటి కేంఖాణ సమితి,
యక్ష కింపురుషాదు లచ్చటి పౌరాళి
వన దేవతలె యందు భామ లెల్ల,
సౌధ శిఖరాలపై మేఘ సభల సద్దు
"తద్ధిమిత" లందు గర్జిత ధ్వనుల మధ్య
హస్త సంస్ఫోటన క్రియా వ్యంజితములు
బహు విచిత్రమ్ము లోషధిప్రస్థ రుచులు. 38

## చ తు ర్థా శ్వా స ము

సురశాఖ వ్రేలాడు హరుఁలైన వలెవాట్లు
ప్రాకృతికాలు పతాకము లంట
స్ఫటిక సౌధాలలో ప్రతిబింబ మిడు తార
లచట పుష్ప ఫలో పహారము లంట
చోర రాత్రులఁ దృణ జ్యోతిః ప్రకాశాలె
యభిసారికలకు దీపాంకురములు
విద్యాధరుల్ కల్ప వృక్షాల నీడల
బాటసారులుగఁ గన్పట్టుదు రంట.
యౌవనము కన్న లేఁత ప్రాయమ్ము లేని
పుష్ప ధన్వుని కన్న యముండు లేని
సురతపున్ లాహిరీ మించి చొక్కు లేని
పరమ సుఖ నిధి యోషధి ప్రస్థపురము. 39

బొమలు ముడివైచి పంట నోష్ఠము పెనంచి
విదిచి యెద్రుచుచుఁ జూపుడు వ్రేల నద్రిచి
గ్రుడ్డు లుబ్బించి పద్రిచెడి కుల్కుటాంగ్రఁ
బ్రియులు దయ వచ్చు దాఁక ప్రార్థింతు రచట. 40

గంధమాదన పర్వతా కార మెల్ల
ఘుగఘుగలు వీచు పురవీథిఁ బూలతోఁట;
ఆ పురముఁ జూచి మునులు చోద్యమ్ము నంది,
ఋషుల కా స్వర్గ కాంక్ష వెట్టితన మనిరి. 41

వ్రాలిరి పర్వతేశ్వరు దివాణము ముంగల దేవిడీ కవా
టాలకు మధ్య చిత్రపుఁబటమ్మున వెల్గెడి సప్త జిహ్వాక
జ్వాల వెలార్చు నగ్నుల పసందున సప్త ఋషుల్; జటా కలా
పాల ధళంధళల్ మెఱయఁ బై కెగఁజూడఁగ ద్వార పాలకుల్. 42

"కిసలయమ్ములు లేక కుసుమమ్ములును లేక
ప్రభవించు నట్టి పుష్పమ్ము వోలె
శ్రావణమ్మును లేక జలదమ్ములును లేక
జలజల కురియు వర్షమ్ము భాతి
పుణ్య మేమియు లేక వ్యోమ యానము లేక
నరుఁడు స్వర్గమ్ము కన్నట్టి తీరు
ఆచార్యుఁడును లేక యధిక సంస్కృతి లేక
మూఢుఁడు జ్ఞానియై పొంగు పోల్కె.
మంత్ర సిద్ధి లేక తంత్ర యోగము లేక
యినుము పసిఁడి యౌచు నెసఁగి నట్లు
తమ హఠా చ్చిత్రిత మ్మైన దర్శనమున
క్రొత్త తేజమ్మెదో మాకు గుబురు కొనియె. 43

ద్విపద:

మీ పదాబ్జాలు నా మేన నిల్పితిరి
పాపాలు నశియించి పరిశుద్ధుఁ డైతి
నేఁడు మొదల్ నన్ను నిఖిల జగమ్ము
వేఁడుకొనున్ మోక్ష పీఠమ్ము పొంచె
పూజ్యులు కల తావె పుణ్య తీర్థమ్ము
భోజ్య రాజ్యమ్ము ముముక్షుల కంద్రు. 44

గంగవాహిని నా యుత్తమాంగ మందు
పడి పవిత్రమ్ము చేసె. నీ పైని నన్ను
ప్రత్యణు పవిత్రుఁ జేయు పురంధ్రి తోడి
సప్త ఋషి పాద కమలాల జాఱు జలము. 45

మీ దయా భావమునకు నా మేన నుండి
పొంగి పైఁబడి పొరలెడి ముదము మోయ
నష్ట కకు బంతముల దాఁక నావరిల్లు
నవయవమ్ములు పరిపక్వ మాయె నాకు. 46

కొండ మేనునఁ బాదాలు గ్రుచ్చినారు.
జన్మము తరించె నింక నా జంగమ స్వ
రూపముం గూడ మీ సేవలో మునింగి
ధన్య మగుఁగాక మౌని మూర్ధన్యులార! 47

మీ పిసాళింపులరు నా సమీపగుహల
జీఁకటియ కాదు, నాలో వశించి యున్న
కటికచీఁకటి కూడ నిష్క్రాంత మయ్యెఁ
బైపయి రజస్సు పోవదా పదము లాన. 48

ఏమి పనులుండు దమకు నీదృశుని వలన
నున్నను నసంభవమ్ము లెందుండ బోవు,
ఇటకుఁ గేవల ముద్ధరించుటకె నాదు
నెదుట దయచేసినా రని యెంచు కొందు. 49

ఐనను గాని వీని కేదేని నింత
యాజ్ఞ యిడు డంచు బ్రార్థింతు నంజలించి:
ప్రభు దయా పాదబమును సేవకుఁడు ప్రాప
పాత్ర యనఁగ నాజ్ఞాపింపఁ బడుట కాదె. 50

ఈమె సహధర్మచారిణి, ఇతఁడు నేన,
వంగడమునకు నిశ్వాస వాయు వేమొ,
కన్య యల్లారు ముద్దుగా గన్న బిడ్డ,
మొదల యిడుఁడని గిరిరాజు మోఁకరింప. 51

"మఖభుజా! సఖ సుఖదమౌ మఖము తోడి
శిఖర సదృశ మహౌన్నత్య శీలుఁడీవు,
ఇంతియే కాదు, నీవు మఱింత కన్న
కోటి రెట్లెక్కు డౌదార్య గుణము కలఁడు. 52

భూ భారమును నీవు మోయుచుండుట గదా
 త్రాఁచునకున్ మాట దక్కుచుంటఁ,
స్థిరముగా నిలుచున్న హరిచంద్రు నిన్ను నీ
 కడుపు పంట గదా జగమ్ము లన్ని,
పాథోధి లోంగని నీదు సత్కీర్తిచే
 సదులచే సృష్టి పునాన మగుట
హరి పాదముల గంగ యగు నాడువలె నేఁడు
 నీ సిరస్సున గదా వాసి కెక్కు.
ఎల్ల నిండి యుండెనే హరి యను టొక్క
వామనావతార భవము నంద
కాని, నీవు సర్వదా నిండి యున్నాడ
వెల్ల, నీదు శక్తి కెల్ల గలదె! 53

యజ్ఞ భోజనమునకు నాహ్వాన మంది
పసిఁడి కొండకు శిఖరాలు వంచినాపు.
శైల రూపమ్ము నిష్ఠుర శీల మయ్యు
దివ్య రూపము కలదు భక్తికిఁ గొటారు 54

వినుము వినుమయ్య! మా రాక మనవి సేతు
మనుకొనని కార్య ఫలము నీ యదియ సుమ్మ.
ధాత్రిఁ గల్యాణ బోధన మాత్రమునకె
"హక్కుదారుల" మేము మా వాక్కు వినుము. 55

స్ఫటిక వర్ణము పైని జట కలంకార మౌ
 మల్లె పూదండ జాబిల్లి తనకు,
నెని మిదైశ్వర్యాలకును దానె రారాజు
 మిత్తి కుత్తుక మొత్తి హత్తు నతడు

ప్రభుపు లెవ్వరు దాల్పరాని "సర్వజ్ఞ స-
ర్వేశ్వర" బిరుద మెడ్డేని తనది
తన యష్టమూర్తులకును నైక్యత ఘటించి
ప్రాపంచికము లాగు ప్రభు వతండు
యోగు లెల్లరు ప్రణిధాన యోగ మూని
దేహమందు సన్వేషించు దివ్య దీప్తి
యాతఁడే సుమి విశ్వ కల్యాణ నేత
సర్వమంగళుఁ డాత, డభర్వుఁ డెపుడు. 56

సాక్షా త్సర్వ జగ న్నియామక కళా సాక్షిత్వ మవ్వాని దా
రక్షా శిక్షణ బాధ్యతలన్ దనవి, తౌరాసాహ్య వాగీశ ప
ద్మాక్షాదుల్ పడి మోఁకరించి పరముల్ ప్రార్థింతు రే! ఆ విరూ
పాక్ష స్వామియ మా ముఖమ్మున మిమ్ముం బ్రార్థించు సర్ధాంగికై, 57

వా గర్థంబుల భాతి నా కవను సంభావించు టత్యుత్తమం
బీ గౌరీ లలనో చితాద్భుత కళా హేవాక సంపత్తి యా-
నాగా లంకృతికే మెలంగె, ప్రియ కన్యన్ వాని కర్పింపుమీ!
భోగ మ్మన్నది యింత కన్న గలుగం బో దెందు నెవ్వారికిన్. 58

ముద్దు బిడ్డకుఁ దగినట్టి మోహనుండు
పెనిమిటిగ దక్కుటే పెద్ద విందు నంగ
మేన మేన రోమాంచము లూను టరసి
భర్త యనుమతి వడసి యా వైపు తిరిగి
అంత నిట్లు లరుంధతి యందు కొనియె. 59

"ఈ రోజు మొదలు మీ గారాల బిడ్డకే
"జగదంబ" యను భాగ్య మెగసి పడుట
దేవ కోటీరాల దీప్తి రింభోళి మీ
యమ్మాయి పాదాల యందు మెఱయు

నేఁడు మొదల్ సుమీ ! నిఖిల సృష్టికి మీరు
తాతలు మీ చిట్టితల్లి కతన
సకల లోకాతీతునకు మీ యనుఁగుఁ బాప
యర్ధాంగి యగు భాగ్య మలుము కొనును
ఎవనిని నుతింపఁ డతఁడు; నుతింపఁ బడును.
మ్రొక్కఁబడు గాని యొరులకు మ్రొక్కఁ డతఁడు;
నిను నుతించును; నిను మ్రొక్కు; నిను భజించు;
విశ్వగురునకు గురు వౌమి పిల్ల నిచ్చి; 60

పెండ్లి కూఁతు రపర్ణ; నీవే యొసంగు
వాఁడ; వీ మేము యాచక వర్గ మౌదు;
మీశ్వరుఁడు పెండ్లి కొడుకు "బలే" మఱింక
నీ కులోన్నతి నెవరు గణింప గలరు. 61

మన్మథుని దుమ్ము సేసిన మాసటీఁడు
తన్మయుండయి మీ కూఁతు భాగధగ్య
మునకు నున్మాదుఁడై లొంగి పోయె నసఁగ
నిట్టి సౌభాగ్య రేఖ మఱెందుఁ గందు. 62

ఫాలనేత్ర నేత్రాగ్నికి బ్రతిగ సతియు
నొసట గుంకుమ మంకెన్న కుసుమ మూను:
హిమగిరి కుమారికా చిత్రకము కపర్ది
కంటి మంటలతో సెలగాట మాడు.

ఆలోచింప విశేష మేమి కలదమ్మా ! యిందు, సర్వమ్ము మీ
రే లోడించిరి "ఓం దథాస్తు" నుచు నూరీకారముం దెల్పి యీ
లాలిత్యంపు నిధాన మైన నవలా లావణ్య రాశిన్ లస
ల్లీలా మానుష విగ్రహున్ శివున కర్పింపుండు కైంకర్యమా" 63

"అమ్మాయీ ! యిటు రమ్మ" టంచు దన హస్తాబ్జ ద్వయ మ్మెత్తి"దు
ర్గమ్మా ! ముద్దులగుమ్మ ! కుందనపుబొమ్మా !" యంచు లాలించుచున్
గమ్మం గమ్మనఁ గౌఁగిలించుకొని యంకాధిష్ఠితం జేసి కొం
చెమ్మెల్ దిద్దుచు ముద్దులాడ దొడఁగెన్ ట్రీ రూప విద్యుల్లతన్, 64

"ఏమమ్మా !" ఇది మాదు కోడలని యూహింపంగ నభ్యంతర
మ్మేమమ్మా !" యని మందహాసమున తల్లీ ! రమ్మ మాతో భవ
త్ప్రీమారామము పత్వ మైనదట; బంపిల్లన్ జగ త్సంస్మృతి
క్షేమాధారుని దీప్తికిన్ మలఁచుమీ శృంగార మర్ధాంగివై. 65

విచ్చిన కను కల్వ వెల్లువైన మరంద
ధారలే తమ సమాధానములుగ
పులకాంకురములతో దొలఁకాడు తనువల్లి
తత్తరపాటు ప్రత్యుత్తరముగ
అంహోర జంపతుల ఒన్యోన్య లావణ్య
పరవశ దృష్టి "జవాబు" గాగ
మాట రామికిఁ గన్నుఁ తేటి రొదమ ఝాంక
రించు చే యురరీకరించుటలు గ

కంచు గంట వలెన్ ధ్వనియించు దివ్య
కావ్యమున వోలె, మాకు వ్యంగ్యమగు మీదు
వదనముల లోని భావమ్ము హృదయమునకు
నిల్వ టద్దమ్ము ముఖ మని నిర్వచింత్రు. 66

కర లీలాకమ లాతపత్రములు లెక్కం బెట్టు నమ్మాయి తా
శిరమున్ వంచుక తాత ప్రక్క నదిగో చేరెన్ స్మితాస్యాస, నీ
తరుణిం జూతువ దేల ! ఔ నవును తాతా ! ఎంత సంసారికే
నరయన్ కన్యల కార్యముల్ గఱుప నిల్లాండ్రే కదా నేత్రముల్. 67

ఏమేమో ! మరియాద పట్టులు నిరీక్షింపం దగుంగాని సా
ధ్వీ మాణిక్యముగా పురాణిలు పురంధ్రీ ప్రాజ్ఞకున్ దృష్టిలో
మోహమున్ వాడగ వీఁగునా పతితలంపుల్ త్రోసిరాజై, కృత
ప్రామాణ్యముల్ కద భారతీయ ధరణీ రాసుల్ స్వ ధర్మా ప్తికై." 68

అనఁగనె మౌను లెల్లరు, "తథాస్తు తథాస్తు తథాస్త టం"చునుం
బనిగొని రైకకంఠ్యముగ, పర్వత నాథుఁడు ధర్మపత్ని యా
మెన గనరాని యా లల దదృష్టపు మత్తున నిట్టి వీరి శే
మున పలె సంచుసున్ మొరసుతై నిలుచుండి విరాకుఁ జెందుచున్. 69

"సాష్టాంగమ్ముగ సప్రమాణముగఁ గన్యా రత్న మర్పింతు; మ
యష్టైశ్వర్యము లాకళించుకొను విశ్వారాధ్య పాదాలు సం
తుష్ట స్వాంతులమై సుధం గడిగి యంతుంబొంతు లేనట్టి మేల్
పుష్టిన్ మోక్ష రమా తిసౌఖ్యమున కాపోసాన మం దాసమై. 70

మను ధర్మాదుల బాటలన్ జగతి "కోం సత్యం శివం సుందర"
మ్మని కాదా తపుబోధ, దాసుల దరిన్ ప్రార్థింపు లేలొక్కొ; శా
సనముంగా శిరసావహింతు భవ శాశాస్యమ్మ్మ, కానిండు, నే
నును నీ నా సహ ధర్మచారిణియు నెంతో పూజ్యు లైనా మిఁకన్. 71

మొన్న కంఠాత శింజాను బుగ్గిచేసి, నట్టి పుస్కారి కేల వయ్యారి వాని
యాజవంజవమందునా యాత్మజాత కెంత సుఖ మైన సర్వజ్ఞు డాత డౌట
సిరి రా మోకా లొడ్డెడి దురుసునుగాను నేపు నట్టి దుందుడుకు తన
మ్మఱవీస మైన లేదీ వరివస్యా భావు దరిని భవికుఁడ నైతిన్. 72

"బిడ్డా ! నిన్ను మహేశ్వరేశ్వరునకే భిక్షమ్ము కై నేసి మ
మ్మడ్డాడించు మనోవ్యథన్ విడిచి దివ్యుల్ మౌను లడ్డంకులున్
కడ్డాయమ్ములు లేని యాచకులు కాఁగా ధన్యులై నార మే
విడ్డూరమ్ములు లేక శంకరుని శీవిం గాంచి వర్ధిల్లుమీ ! 73

స్సద్దం గూరిచి మృత్యుజేత రతికిన్ సౌభాగ్య మర్థించుచున్
"లడ్డుం" బోరిన బిడ్డం గని ధరా లావణ్య సంప్రాప్తికై
యొడ్డాణమ్ము బిగించి శంకరు నెఱా హుందాలకుం దగ్గటుల్
తెడ్డున్ వీడక ముక్తి దె మ్మనుచు బోధించెన్ మమత్వమ్మునన్. 74

కుసుమేష్వాసు నిమేష కాలమున బొగ్గుం బుగ్గి గావించి యా
యసువుల్ వాఁచిన మేటి కీమె సతిగా; నాజీగనస్వామి ప్రే
యసిగా, నా నటరా డ్వధూటిగను; సాష్టాంగమ్ము లర్పించు నీ
పసిపిల్లం గని దీవెనల్ కురియఁగా ప్రార్థింతు మి మ్మార్యులన్. 75

లోక సంరక్షకమ్మైన వెలుంగు తపము
వీడి తమ రెల్లరింత నా ప్రియము దలఁచి
పడిన శ్రమ కేను తడబడి బిడియ పడుదు,
ఏమి గతి! నన్ను క్షమియింపుఁడీ; నుతింతు. 76

మత్తకోకిల:

మౌని చంద్రులు చంద్రమౌళి నుమా నవోఢను గూర్పఁగా
పూనినారు సరే! అరుంధతి మోము చెమ్మట వాఱగా
దాను నింతఁ బరిశ్రమించుట దైవ మెట్లు సహించునుం
గాని మాకది తీర్పరాని ఋణమ్ముగా" యని పేర్కొనన్. 77

"వరుఁడే యార్యుని గన్య ని మ్మనుచు సంప్రార్థించు నాచారపుం
బరిపాటిన్ దిగద్రొక్కు టేల"ని మహాభావుండు పుత్తెంచి నాఁ
డరయంగా నిది లోక రక్షక కళా వ్యాపారమే కాద! త
ద్గిరిశా రాధనమున్ గిరీశు సిరి నుద్వీక్షింతు మంచాడుచున్. 78

పరిపక్వ మ్మగు దీవనల్ తొలకరింపం జల్లి రాలోన దు
ర్భరమై మేనక కంట బాష్పములు రాలం జొచ్చె పెన్వెచ్చగా
పరమప్రేమము తల్లి ప్రేఁగుననె కన్పట్టుంగదా! మేన సొం
పఱి బెంబేలయి వెక్కి వెక్కి విలపింపంబోయె గూఁతుం గనన్. 79

అది యరుంధతి కనిపెట్టినది బిరాన
హర జటా జూట మా గంగ నాఁగినట్లు
పైఁట కొంగునఁ గన్నీటి వరద నాఁగి
చేరి యాశ్వాసమునకు గర్జించె నిట్లు. 80

"గాఢ ప్రేమ కుపజ్ఞయై సవతి చీకా కేఁడు విశ్వంభరా
వోఢస్ మిత్తిని మొత్తు నిల్లటికపున్ మోక్షు, జామాతగా
వ్యోఢా లీఢు గడించినావు; మఱి యేలో బెంగటిల్లంగ" నాన్
ప్రౌఢాప ద్విషుషిత్వమ్మున్ మెఱయ నారంభోతి యోదార్పుదుస్; 81

మిసమిసలు గుల్కు నెఱిని నొసటి బొట్టు,
పసదయిన కొప్పు కప్పెను కుసుమ కాంతి,
ముక్కునన్ ముత్తెమున తెక్కు పక్కు పసిడి
సడ్డ బాసయు, నూపురా యాత రవము;
నరసి తేరెను మేన కాశ్రా వలగ్న. 82

కన్యాదాతయుఁ బెండ్లి మూరుతము వక్కాణింపు దన్నంత నా
మాస్యల్ నాఁటకె మూఁటి పైదిసమునస్ మాంగళ్య మౌహూర్తిక
ధ్వన్యాలోకము శోభసమ్మ సుముహూర్త మ్మంచు వాక్రువ్వఁగా
"ధన్యోహ" మ్మని మ్రొక్కె నాతఁడు: తిరోధావించి రుద్దీన్నుతై. 83

కుతుక మ్మొప్పఁగ సప్తమౌనులు మహాకోశీ ప్రపాతమ్ము పై
కత వేదిన్ శివు ముంగటన్ దిగిరి; శ్రీ కల్యాణ గౌరీశు కా
కత సర్వస్వము విన్నవించుకొని యాకాశాంతరాళమ్ములో
బతగాలౌచుఁ బతంగ గోళమున పైపై నేఁగినా రంతనే. 84

పార్వతీ కాముకుఁడు బలవంత మెట్లొ
గడుపు కొనినాడు గడుపు యుగాలు వోలె.
ఔర! శృంగారమే మితిమీఱి నపుడు
అస్మ దాదుల గతి కేమి విస్మయంబు. 85

# కళ్యాణకావ్యము

## పంచమాశ్వాసము

శ్రీసతి సుతు సత్త్రమ్ము సు
నాసీరా యుధమునుఁ దృణమ్ముగ నిలలో
వాసిం గనుచును సర్వ ది
శా సౌఖ్యము గూర్చు శర్వ శక్తీ! హనుమా!

ఆహ్వానము



శ్రీనానాసన భోగి పట్టుగొడుగై సేవించిశోభింప నే
త్రానందున్‌గరుటాలమంతునిపత త్రాంతమ్మధిష్ఠించి నా
కైనాభాగ్యములీయవచ్చుమిము మోఁకారింతు విచ్చేసి ల
క్ష్మీ నారాయణులార! మాపయిని రేకెత్తింపుఁడా కేకరాల్

"సఖులై శీర్షము లూచుచున్ సుర ఋషీశానుల్ చతుర్వేదముల్
శిఖరమ్ముల్ ముఖరించి కొల్వఁగ మరాళీ వాహనా రూఢులై
శిఖి పింఛాళి సుఖాకరింప నిటు వేంచేయుండు వాణీ చతు
ర్ముఖులారా! ఇఁక పెండ్లి పెద్దలును కాబోల్ మీకు జోహారువుల్." 2

"దౌదంతిపై నూగి సాగు శచీ పురం
దరులార! రండు వందన శతమ్ము
జవముతో సాగు బుష్పక విమానమ్ముపై
నలకాధిపా! కొను మంజలింపు
మహిష ఘంటా క్వాణ మాంగళ్యమున వచ్చు
యమ ధర్మరాజ! సుస్వాగతమ్ము
మహతీ కళావతీ సహితమ్ముగా వచ్చు
దేవర్షులార! ఆతిథ్య మిదిగో!

నదుల హల్లీసకమ్ముల కదను తోడ
వచ్చునో యాదసాంపతీ! ప్రణతి గొను"మ
టంచు నాహ్వాన మిడె మిటారించు పసిఁడి
తమ్మి పువ్వుల చదలేటి కమ్మనీట. 3

"తేజస్వంతుడు కర్మసాక్షియు ధరిత్రీ చక్షు వైనట్టి ఛా
యాజానీ! దయసేయు, మాత్మజకు గల్యాణమ్ము నాచేయు నీ
పూజల్ కైకొను సప్తసప్తుల రథమ్మిం దోలు మీ కుంటి "మం
తాజీ" నేని కనీసముం బనుప రాదా, నీవు రా లేనిచో. 4

ఈవు వచ్చిన సృష్టి స్తంభించు నంచు
వంకపెట్టి కుమారుని పంపి తనుచు
తృప్తి పడెదేమొ; ఎవ్వరి కెవరు కారు;
సర్వ సామర్థ్యములు గల చతురుఁ డీవ?" 5

"వరు కంట నుంటి న న్వంక రావేమొ, స్వా
హాదేవి నే నంపుమయ్య మిత్ర!
శివునిపై నుందు నందువా; జింకనిచ్చి రో
హిణి దేవినేని పంపింపు మయ్య!
గంధవాహా! జగత్కథ మూఱు నని రావా!
లేడి పటాణినే వీడ రాద!
పుష్కలా వర్తకాం భోధరా! మెఱుపుఁ బెం
డ్లాలతోఁ జెట్టపట్టాల రమ్ము.

రండు రండు హాహా హూహూలార! రండు
కర్మమోట్యాది సత మాతృకలును రండు
పారిషదులార! రండు నా భవనమునకు
జన్మము తరించె, మఱి లేదు జన్మ మింక. 6

దక్షుఁ డిట లేఁడ. ఉన్నను శిక్ష వలదు.
నిర్భయమ్ముగ వచ్చి గణేయు లగుఁడు"
అనుచుఁ గెలసమ్మనన్ శుభా హ్వానములను
వడివడిగఁ బంపె తెక్కలి కొడుకు చేత. 7

ఏ నవ ద్వయ ద్వీప భూజాను లసఁగ
నేల! బ్రహ్మాండ మెల్ల పట్టించు కొనెడి
ధవళ గిరి పైని కట్టాయితమ్మొ సర్వ
మంగళాంబకు కళ్యాణ మంటపమ్ము. 8

పుష్యరాగ స్తంభములు వేయి పాతించి
యింద్రనీలాలు నాటించి రంగు
స్థగియించి నారా మసారాలలో చల్లి
తేజమ్ము లొలయు మౌక్తిక రజమ్ము,
మౌక్తికమ్ముల మధ్య రక్తి కట్టించుచు
గరుడ పచ్చల డాలు గంతుకొనియె.
పద్మరాగ మయమ్ము సద్మ భిత్తులలోనఁ
గురువిందముల్ నెలకొల్పినారు.

పసిఁడి కరిగించి రసమార్చు పాలగచ్చు,
శంకరుని యట్టహాసాల సరకుగొనని
నిలువు టద్దాల మేల్కట్లు మలఁచి రిట్లు
శైల పతి కెల్లరాలు దాస్యమ్ము నేసె. 9

వజ్ర వైడూర్యములను ప్రవాళములను
రంగురంగు జాలరులు ప్రేలార్చినారు.
నాగరాజ శిరో రత్న ధాగధగ్య
ములకు శంపా లతాళికి పోరు రేల. 10

పారిజాత మ్మొక్క ప్రక్క నిట్రా డయ్యె
        నొక్కట సంతాన ముండె నిల్చి,
మఱియొక్క దిక్కున హరిచందనము లేచె
        మందార మొకవైపు సందడించె,
గుబురైన పల్లవ కోరకమ్ములు నిండి
        పెండ్లి పందిరి హోసు వెలయ జేసె.
కల్పవృక్షము ముందుగా నిల్చి పూచి కా
        చి ఫలించి మించి మల్చిసది హోయలు

గువ్వకరికొని ఋతువులు నవ్వుకొనుచు
నోలగించె గన్యాదాతృ శైల మెల్ల,
పెండ్లివారికి గిరిగుహల్ విందుచేయు
విడుదు లైనవి, ప్రకృతి ప్రభ్వికి జోహారు. 11

అన్ని చోట్ల వైకుంఠమ్ము లల్లుకొనియె,
ఎల్ల యెడ సత్య లోకముల్ వెల్లివిరిసె.
చంద్ర కాంతాల మేల్కట్లు సవదరింప
క్రొత్త భువనమ్ముగా నద్రి కొమరుమిగిలె. 12

దేవతలు రాక్షసుల్ నేటి దీప్తి గాంచి
హద్దు మీఱిన మోద ఖేదానుభూతి
నేడ్చినారు; మూర్ఛిల్లి మఱేమి యైరొ!
సర్వ లోకమ్ము లిట పుణ్యజన మయమ్ము.

సింహాద్రి భద్రాద్రి శేషాద్రి మందర
        చక్రవా ళోదయాల్ సాగినారు,
కరిశైల శ్రీశైల గంధమాదన శైల
        వెంకట శైలముల్ వెడలినారు,

కోలాహలుఁడు హేమకూట త్రికూటాలు
నిషధ సహ్యాద్రులు జేరినారు,
మాల్యవంతుఁడు శుక్తిమంతుండు మాహేంద్ర
పారియాత్రులు బయల్దేరినారు
అస్త కైలాస మలయ రోహణము లాది
జలధి పుక్కిలించిన మౌని చట్టు జట్టు
కొండ పల్లాయనము వారు పిండుగట్టి
యెదురు సన్నాహములకు గమించి రిట్లు. 14

పుండరీ కేభమ్ము పుండరీకాక్ష ప్ర
త్యుత్థానమునకు నుద్యుక్తుఁ డయ్యె,
పుష్పదంత గజమ్ము పొగడదండలు వైచి
బ్రహ్మదేవునకు నాహ్వాన మిడియె.
సార్వభౌమ ద్విప స్వామి సహస్రాక్షు
సత్కరించెను గయిదాఁపు లిచ్చి,
సుప్రతీక మదావళ ప్రభుఁ డేతెంచి
హరిదీశులకు బరాబరు లొనర్చె
కుముద దంతావళ మ్మెదుర్కోలు సలిపె,
కొలువ నేతెంచె నంజన కుంజరమ్ము,
సేవ కేతేరె వామన సింధుర మిటు
పార్వతీ పిత మగపెండ్లి వారి గనియె. 15

తామ్రపర్ణీ శుభ్రదం త్యంజనావతుల్
కర్పూర హారతు లేర్పరింత్రు.
అభ్రము కపి లాంగనా నుపమా దేవు
లామతింతురు పేరఁటాండ్ర నెల్ల.

పింగళాంగన వచ్చి మాంగళ్య పత్నులకు
నొసటఁ గుంకుమ పెట్టి పసదు గూర్చు
కోలాహలాద్రి యిల్లాలు శుక్తిమతీ ల
లామమ్ము గంధాలు రాయు చుండు.

వచ్చు ముత్తైదువులకు జవ్వాది పూసి
మేనఁ బన్నీరు సల్లి శ్రీ మేనకాంబ
వస్త్ర రత్న తాంబూలాది బహుమతులను
ముచ్చటగ వంగి మర్యాద నిచ్చు చుండు. 16

క్షీర సాగర కన్య చీర సింగారించె
లావణ్యనిధి కపర్ణకు వటారి,
చదువుల దొరసాని సంతాన పుష్పాలు
చిత్రించి వాల్జడ సిగకుఁ దురిమె,
కుల పర్వతముల భార్యలు వచ్చి రత్నాలు
కరిగిన నగ లలంకార మిడిరి.
అష్ట దిక్పతుల యర్ధాంగులు గల్యాణ
తిలకమ్ము పారాణి దిద్దినారు. 17

సొగసు తొడి రప్సరసలు కస్తురి జవాది
ఘుమఘుమల్ చిమ్ముచుం బెండ్లి కూఁతు కళకు.
ఆర్య నైసర్గి కాద్భుతా హార్య మందు
నెల్ల సౌందర్యముల్ సురాళింపు లటవె. 17

పృతనాషాట్కృత తారకాసుర వధార్థీభూత దివ్యాధ్వరా
హుత సాన్నాయ్య లతాంత సాయక మహోత్యుత్సాహ వత్సాహసా
ద్భుత చర్యా ఫల మైన శంకరుని బిబ్బోకమ్ము లూరించు ప
ర్వత రాట్పుత్రి కళా కటాక్ష మయ కల్యాణమ్ము నేఁడే సఁటే! 18

నిగమా యామ చతుష్క చంక్రమ సమున్నే యాధ్వనీనుల్ సుభ
వ్య గవుల్ దివ్యులు హవ్య కవ్య సదవ శ్యాహూతి భాగ్యప్రభుల్
భగవానుల్ పది దిక్కు లేలెడి మహోభావుల్ వివాహ క్రియా
జగతీ వైదిక సాక్ష్య భూతు లట సాక్షాత్కారమై రాదృతిన్ 19

"గోవిందాయ నమోనమో" యనుచు మ్రొక్కుల్ పెట్టి ప్రార్థించి యే
రో వైవాహిక కార్య ధూర్వహణ పౌరోహిత్య పీఠమ్ముపై
దేవర్షుల్ పురికొల్పి హెచ్చరికఁ బ్రార్థింపంగ సప్తర్షు లా
హా వాదమ్ముల బ్రహ్మ పీఠములపై నాసీనులై రాదటన్. 20

శ్రీనాథుం డటఁ బాల సంద్రపుఁ గుమారీ రత్నముం గూడి యీ
శానుం బెండ్లి కుమారు తండ్రి యయి యాశాసింపఁగా వచ్చి ని
ష్ఠా నిర్మాణము స్నాత కేందుమణి పీఠమ్ముం దధిష్ఠించె; స
త్యానందమ్మున కన్న గారయిన యాత్మా నంద ముబ్బించుచున్. 21

లీలా మానుష విగ్రహుండు: నిజు పంద్రెండేండ్లు: గంగా తరం
గాలం దెల్లని పట్టు కుచ్చుఁ దలపాఁగా జుట్టెఁ: బైఁ బాఁప రా
బాలుం డొంటు తురాయిగా బిగగ విప్పం: జిచ్చు: జాబిల్లి: సొ
గాలోఁ గెంపునుఁ బుష్యరాగ మయి సింగారించె సూత్నప్రథన్. 22

రోహిణి పెండ్లి కూఁతు జడలో సవ రెల్ల; బరిష్కరించె, కో
లాహలు కోమలాంగి నవలా తిలకాదులు దిద్దితీర్చె. వై
వాహిక శోభనోచిత విభా సుషమాతి పరిష్క్రియల్ జగ
న్మోహిని మాతృదేవి నెరపున్ మనసార "పదే పదే పదే." 23

శ్రీ వాణులును శచీదేవియు సుధతోడ
మంగళ స్నాన మమర్చి నారు,
జాబిల్లి దొరసాని జాహ్నవీ దేవియు
పెద్ద బావకు బొట్టు వెట్టినారు,

పద్మనాభానంత వాసుకి ప్రభృతులు
కలధౌత మణి పరిష్కారులైన
వీరకత్తె నటంచు ధారుణి హారితోడ
తాళి చేబట్టి పెద్దఱికమూనె.

సవతిజనకుఁడు మామగా నపుడు కెంచి
బిడియమునఁ దలవాంచి యా గడియ లోన
భర్త సర్వజ్ఞుఁడను బుద్ధి పఱపి గౌరి
పశుపతి కపాంగ మిడి పరవశునిఁ జేసె. 24

అద్రీంద్రాత్మభవా తిభద్ర మగు గల్యాణమ్ములో కౌతుకో
న్నిద్రా ముద్రిత కాద్రవేయ సుషమా నీరాశిలోఁ జంద్రికా
సధ్రీచీన మహో సుధా కలశ మీశానుండు రాజిల్లె; మం
త్ర ద్రష్టల్ సత పల్కువాలు దొరలౌ బ్రహ్మల్ పిసాళింపగన్. 25

సభలోఁ బ్రప్రథమమ్ముగా శుభము నిష్ప్రత్యూహమై సాఁగఁగా
"విభవక్త్రి" యని దోయిలించుటకు లేదే నాడు హేరంబు డీ
యుభయుల్ కూర్చెడి నాఁటి దంపతుల ప్రత్యుత్థాన కార్యమ్ము సం
ము; భరింపందగు నెఱుఁ డెప్ప డిఁక; భద్రుండౌనొ దక్షుం డటన్. 26

విష్వక్సేనుని విఘ్నరాజుగ సమర్పించెన్ సపర్యాది; మా
తృష్వస్త్రీయ ముఖాప్త బంధువులు నుద్వేలింపఁగా; రత్న సా
స్విష్వాన ప్రియు లారగించి రట తృప్తిన్; సర్వ లోకాలు "త్వం
సూష్వ స్కంద" మటంచు దీవెనలు విచ్చుం బ్రాల వర్షింపఁగా. 27

కమనీయ స్వర మంజు తాళ లయ భా గ్గాంధర్వ సంగీత ర
మ్యముగా మంత్రము లాలపించుచును. "అద్యాయం ముహూర్త శ్శుభ
స్సు ముహూర్తోస్తు" నఁగా "తథాస్తు"నుచు నస్తుంకారముల్ పల్కు; ను
త్తమ వా క్సుద్ధి నిషుల్ మహాసట సభాస్తారుల్ శుభోద్రిక్తులై. 28

సంతరించిరి కొంత తంతు సప్తర్షులు
హరుని శరీర శుద్ధ్యర్థ మనుచు,
మందహాసా లూపు సందేహ డోలల
పుణ్యాహ వాచనమ్మును నడిపిరి.
"పాహి త్రయోదశ" శ్రీ హోమ మనినారు
దివ్య హైయంగవీస వ్యయమున
చిఱునవ్వు ముత్యాలు చిలికి ఆత్మ ప్రద
క్షిణ నమస్కారా దులును నెఱపిరి
అగ్నిపూజ జలోపాస నాదికములు
పాద రక్షలు మొదలు దేవతల వఱకు
ప్రార్థనలు దేవతాళికి వరుని తండ్రి
యప్పగించుట లాది మర్యాద లయ్యె. 29

ఆలపించిరి వేడ్క "య శ్శివో నామ రూ
పాఖ్యా" మటంచు నశ్వైవు నచట
నత రుసుల్ "సర్వతో జయ మంగళ" మ్మని
సంతరించిరి శ్లోక సమితి నెల్ల
దైన్యమ్ముతో "నన్యథా శరణం నాస్తి
నాస్తి" యంబును దేవు లాడినారు
దీపమ్ము గూర్చి "ధాతా పురస్తా ద్య ము
దా జహార" యటంచు దేజవిలిరి.
"ఆపదా మపహర్తార" మని గొక రట
"యాని కానిచ పాపాని" యంచు దిరిగి
"త్రాహిమాం కృపయా దేవ త్రాహి" యనుచు
"రక్ష రక్ష పరా త్పరా రక్ష" యనిరి. 30

చేయించిరి బ్రహ్మలు దీ
ర్ఘాయుష్యార్థమ్ము నాదిమాశ్రమ లోప
ప్రాయ శ్చిత్తార్థ మ్మా
హూయ ద్దివ్యార్చి రగ్ని హోత్రాదికముల్. 31

పురుషోత్తమునకు యజ్ఞే
శ్వరునకు ప్రీతికయి కొన్ని చదివిరి మంత్రాల్
వరుణాగ్ని సోమ సూర్యులు
సురగురు డింద్రుండు వచ్చి చొచ్చిరి వేదిన్. 32

పశుపతి పెండ్లి నిప్పుత్యూహముగ నాడు
జనియింపఁడా కొక్కు జక్కి రౌతు
బుట్టలో గూర్చుండఁ బెట్టి తోత్అగా
గౌరి పూజకు లేద గౌరి బొమ్మ,
అదె యరుంధతి చూడుడా! యన్న యప్పు డా
రంజోతి లేసు తారాధ్వ మందు.
పుట్టె మాలలు తీసి పూలొత్తి బంగారు
బట్టకట్టుట దిగంబరున కపుడె
రెండు పీఁటలపై నిద్ద ఱేల యనుచు
నొక్కపే పీఁటపై నిద్ద ఱొక్క రైరి
భరత ధాత్రి వైవాహిక ప్రణయ సూత్ర
భావ లహరికి నది మహాభాష్య మటవె! 33

నున్నని చిన్నసన్నని మనోహరమైన పసిండి పచ్చడా
ల న్నగరాజు సవ్వడిగ నల్గని మేనికిఁ గట్టంబెట్టె "నా
కన్నను బాసికమ్ము కలదా" యని మూఁడన కన్ను క్రొన్నెలన్
నెన్నొసటన్ పకాపకల నృత్యము లార్చె లలాట పట్టికన్. 34

కలశారాధన, విఘ్ననాయక నమస్కారాలు, పుణ్యాహ వా
క్కులు, పాణిగ్రహణోత్స వోచిత సద్వాక్కుల్ విన్చి సప్తర్షు లు
జ్జ్వల సర్వాంగ పుసౌష్ఠవమ్ముగను "స్వస్త్యస్తుల్" పిసాళింప ముం
గల నాహూతులు దివ్యు లారసెరి రక్షాబంధనాది క్రియల్ 35

లేమిచేఁ దృప్తించు జామాతలను మామ
లోకువ చేసి పెల్లుబుకు గాక
మామ యజ్ఞానమ్ము మాయింప నల్లుండు
రుద్రుడై పొగ రెల్ల లోఁచుగాక
పుట్టింటి తీఁపితో ముదిరిన యిల్లాలు
మగనిఁ గా దంచుఁ దామరలు గాక
తల్లిదండ్రులు కూఁతు దారిద్ర్యమున నెమె
డీల్పడఁ దా మీసడింత్రు గాక

మిన్ను విఱిగి గుభాలున మీఁదఁ బడును
గాక, దాంపత్య మద్వైత కలశలోని
సుస్థిరానంత దివ్య వస్తు వని తెల్ప
నొప్పు గాక పాణిగ్రహ ణోత్సవమ్ము 36

"తదరిననాన" వారు సరగా కొలఁదిం దను పారవశ్యపుం
బదునున బాడినారు, వహవా ! యని తుంబురు నెచ్చరించె నా
రదుఁ డొకచో బృహస్పతి పురాణము సెప్పెను, మెప్పు లందె నీ
యదనికఁ జూడు "బో"మని మహామహు లొడ్చిరి బాష్ప వాహినుల్. 37

సంగీత గమక వైశారద్య
దాపించి నాదు తాతయ్యగారు
సృష్టి సుమాళించు పుష్టితో వాణి వీ
ణాపించె నవ రసౌన్నత్య ఫణితి.

గిరి శిఖరమ్ముపై కెక్కి లాస్యము లాడ
గుజ్జు హజ్జకు నంది గజ్జె కట్టె
మేనకా రంభోర్వశీ నాయికా మణుల్
జాజువాజించిరి మేజువాణి

శంకరా భరణాలు శీర్షమ్ము లూప
శంకరా భరణమ్ము ద దంక మందు
నొదిగి "హాహా" కు ప్రక్క "హూహూ" లయాన్వి
తముగ నాలాపనము చేసి ధన్యుఁ డయ్యె. 38

ఇట విద్యాధర సార్వభౌము లల బాహ్మీదేవి యగ్గింపఁ బ్ర
స్ఫుట తానార్ద్రి తరంగ సంగతుల మెప్పుల్, దేవగాంధార సం
ఘటనా చాతురి దివ్య కాన లహరీ కల్లోలముల్ చిమ్మ యా
నట రాజున్ స్ఫటికా కృతిం బరవశుంగాఁ జేసినా రా సభన్. 39

ఆహా ! భేషని వేయికోట్లు తల లుబ్బూఁగెన్ సదస్యాన హా
హా హూహూలును, గాణ చిత్రరథుఁ డా యయ్యాయి సీకారులున్
సాహంకారతఁ బారవశ్యమున రాగాలాపనల్ తానముల్
శ్రీ హిందోళ ముఖారి మోహన కళా శ్రీ గుప్పి రా యా సభన్. 40

బహుళ నవరత్న మాలికా వల్గనములు
అష్టపది లగ్న ధౌరిత కాయతములు
మలయమారుత రాగ సంభావనములు
తిల్లనాల గేలాపులు వెల్లివిరియ
గుమ్మమనె సభ ఉచ్చైశ్శ్రవమ్ము గతిని. 41

పెండ్లివారి వటారున విడిదిలోన
హంస తూలికామయ మహా యామమైన
చందురా చపటాలపై శయ్య లమరె.

వెలుగు లీను తృణజ్యోతు లలమె యెదుట
తేజరిల్లె చింతామణి బాజు లుమిసి
కామధేనువు పొంది మతేమిలోటు 42

సదుపాయములు చెప్పి సదుపాయములు చేయ
పెండ్లి పెద్దల కందు భృంగి వచ్చి
ఈ యపూర్వపు జంట కెల్ల లోకా లిచ్చు
కానుకల్ గొను మహాకాళుఁ డచట
వచ్చు పెద్దల కిచ్చు స్వాగతమ్ములు కుహో
దేవుని ముద్దుల బావమఱఁది
శాలువల్ కప్పుచు సంభావనలు చేయు
చండీశ్వరుఁడు సదస్యమున లేచి
సప్త కుల పర్వతాళి భోజనపు వేళ
నడుములు బిగించుకొని వడ్డనలకు లేచు
దిగ్గజ ప్రాణవల్లభల్ హెగ్గడించి
పేరటాండ్రకు పసుపులు పెట్టుచుండు. 43

విత్తము వెచ్చ పెట్టుట కుబేరుని వంతది సక్రమమ్ముగా
బెత్తనమున్ వహించుటది వెన్నుని వంతు వినోద దృశ్యముల్
గుత్తగ పెండ్లివారికి మెఱుంగులు సూపుట నందికేశుడున్
బెత్తము పట్టి ఠీవి మెఱపించుట భృంగిరిటుండు నయ్యెడన్. 4

ఋషి గణమ్ములు దేవతా బృందములును
వసువు లర్కులు మనువులు బ్రహ్మ సమితి.
రుద్రు లద్రి మాతృకలు పేరోలగింప
దాళి గట్టె మెడన్ చంద్ర మౌళి యురుకు. 45

ధర్మార్థమ్ము మహేశ్వరుండు గిరిజా దాంపత్య మెన్నన్ విలా
సోర్మిల్ పర్వెడి నోర్మిమై జిలుకతో నుచ్ఛ్వాస నిశ్వాసలన్
నిర్మాణించుచు రేటి కూటువ సటిన్ మీటించి నేపెంచి బల్
పేర్మిన్ లేచెను తియ్య మామిడి లకోరీ పాదుషా కుల్కుచున్. 46

నైర్మల్య ప్రభు భక్తి రూపుడు ని దాసఁదా కృతిన్ మారుఁడా
కర్మాగారము బూజు దుల్పుచును కేంఖాణ స్థుఁడోచున్ సమి
ద్ధర్మాథన్ ససబాకు నూ.. పికి బాకా లూది, వాసంతుఁడై
దుర్మోహార్తిక వేళం గడిపి ప్రాదుర్భూతుఁడై నాదటన్. 47

నిచ్చుక స్భుక్త శేషమో! వెచ్చనైన
శివుని నిర్మాల్యమో! గౌరి సిద్ధి పొందు
ముదిరిన తపస్సు నిర్మోకమో" యనంగ
జాజి నేజా సహా లే చక్కనయ్య.
యగుచు గంజాత కింజానుఁ డంజలించె. 48

బుద్ధి వచ్చినది "శంభూ" యంచు దక్షుడు
వచ్చి హేమాద్రికి ప్రక్క నొదిగె.
పరిహాస దృష్టితో సురలవై పెగఁజూచి
వీరభద్రుఁడు నేరె ఁబెండ్లి కొమరుఁ
డన పెండ్లి శాపమ్ము దరిసి, లేచిన రతిన్
శుకముతో గౌఁగిలించుకొనె వాణి.
పతిదేవు చితిముందు మతిపోయి కుమిలి ప
ల్కిన, దౌట గాంచి పల్కినది రతియు.
కొంచెము లజా భయాల్ సాళగించు మేటి
సాహసము రంగరించి వసంతు లోని
యలజడిన్ సంబరమ్మున చిలుక రౌతు
చేరికొన్నా డెదో తప్పు చేసి నట్లు. 49

## ఆశీస్సులు

"వేద పదా ధ్వనీన పదవీ న దవీయసి యైన వెద్ద ము
త్తైదువలై" మహేశ్వర సమష్టి సమాధి సమాశ్రయమ్ము, క్ర
వ్యాద నిషూద నాద్భుత కళా తిబలా త్మజు మాత వౌచు శ్రీ
నాథ సపర్యలం గొను సనాతన తేజముగా వెలుంగుమీ. 50

వారణాసిని నన్నపూర్ణా రభటిని;
వంగమువ సింగమున రౌద్ర భంగిమలను
కాళికా మూర్తివై; త్రిలింగమ్ము నెక్కి
పవిత్ర భారత మేలుమీ భద్ర వగుచు. 51

మా యమ్మ వౌచు భక్తుల
కాయువు నారోగ్య భాగ్యమయ మోక్ష శ్రీ
నాయకవై గాయత్రికి
వాయువుగా కావు మీ ప్రపంచ మ్మెల్లన్. 52

భక్తికి లక్ష్యభూతి చి దుపజ్ఞ కుపజ్ఞస్వయంప్రకాశుఁ డ
వ్యక్త పురాధి నేతయు మహా స్మహిత ప్రతిభా ప్రభావసం
సక్త నిజ ప్రకాశ పురుషస్థిర నాముఁ డనాది శక్తికిన్
భోక్త సమస్త మిచ్చుత నవ్యథకు దుర్గకు దివ్య శక్తులన్. 53

భంగ మెఱుంగని ప్రణిధా
నాంగీకృత చి త్స్వరూప మగు నీ జంటన్
అంగుష్ఠ మాత్ర పురుషుడు
మాంగళ్యము లిచ్చి సృష్టి మనుచుత మెపుడున్. 54

ఊర్ధ్వమూల మధ శ్శాఖ మొక్కా మొక్క
నెక్కి మొక్కలమున సృష్టి చక్కబఱచు
నెక్కవీఁడు పరంజ్యోతి యీశిశు నీశ
నేకతన్ చూపి లోకాలు సాఁకు గాక. 55

అమల పంచాక్షరీ మంత్ర మావహించి
స్ఫటికముల్ దురాశలు చౌకళింప,
వలయుచో బౌరుషమున కృపాణ శూల
శక్తివై లోకములు గాచి ముక్తనిన్ను." 56

అనుచు శ్రీ బ్రహ్మ విష్ణు లౌ యష్ట దిశల
పాలకుల్ మున్నుగా సేసలు కురియ
బావగారను పేరుమై వచ్చి దుగ్ధ
జలధి జాసుత ఇటు లెక్కసక్కె మాడె. 57

"మీ వారగు మా వానికి
వైవాహిక పుష్పబాణ వాచక మెల్లన్
దేవేరిగ గైవారము
కావించుచు బోధసేయగా వలయు సుమా! 58

శీవియు దాదియు మీ యా
బాపకు నేర్పుకొనవలయు పరువపు ముద్దుల్
లే వీతని కైన మహా
దేవుఁడు నటరాజు మేటి తెలివి గలాడున్. 59

రుద్రుఁ డంట విశ్వ భద్రమ్మునకె గాని
పట్టి గంగిగోవు పరమ శివుఁడు
హంసయాన యెట్లు సంసార మందునో
పిచ్చి జంగమయ్య పెండ్లి కొడుకు."
టన్న చిరునవ్వునన్ హరుం డలరి యలరి 60

"నీతో నున్నవి నాకు పుణ్యములు మున్నే గాదు నే డైననున్
పాతివ్రత్యపు హద్దు పద్దు లట తాత్పర్యాల్ సమీక్షించి ము
త్తాతల్ పెంచిన, నాస్తిక ప్రజల కొలంతల్ లేని, విద్యార్థినీ
చాతుర్యమ్మున సర్వ లోక యువతీ సంపత్తు పోషింపుమీ! 61

నీ వీ కార్యము నిర్వహించుటకు నన్నేదో నిమిత్తమ్ముగా
భావింపన్ వలె. సర్వభారమును నీపై నుండె ప త్సిద్ధికై
నా వైభోగము నాదు సర్వ బహిరంత శ్శక్తులన్ నీ హృదిన్
వ్యావర్తింపఁగ జేతు. చేకొను మివే ప్రామాణ్య లావణ్యముల్. 62

సహనా శ్రయమ్మైన జన్మపారంపరీ
ప్రాభవ మ్మొడ్చు తపస్సు వలయు
లలిత కళాదేవి లావణ్యముల నెల్ల
నిల్లాల వొచు బూజింప వలయు,
ఇహ పర సుఖ మార్గ గృహ శౌచ మర్యాద
లకు మెఱుంగులు పెట్టి ప్రబల వలయు
పతివోవు పెడదారు లితిహాసములు సెప్పి
మరలింప దగు మహామతియు వలయు

ఇట్టివి పరిష్కరించి వర్ధిల్లు కొఱకు
దగు పురంధ్రీ మహా శాస్త్ర దర్పణమున
మొకము చూచుక హౌసు దిద్దుకొనవలయు
నెంత బాధ్యత కలదొ గుర్తించు కొనుము. 63

రామా శీర్షమణీ! సు సంసరణ కర్మాగారమం దీవు బల్
ప్రామాణ్యంపు ప్రభుత్వమై వెలిసి సర్వస్వాధికారమ్ముతో
మోమోటల్ విడి పైడి నాణియణులన్ ముద్రించి మోక్ష ప్రభాం
బా మూర్ధమ్మున సంతరింప వలె సు స్వర్ణా భిషేక క్రియల్. 64

ఓసీ! ప్రేయసి! దివ్య మైన మన యన్యోన్యమ్ము పూర్వార్జిత
శ్రీ సంపాదిత మన్న గుర్తునకు సాక్షీభూత మీ పెండ్లి, ఓ
సీ! సౌభాగ్యవతీ! గ్రహింతు నెక యిందే కల్ప పారంపరీ
ప్రాసా దార్బుద కోటి దాఁక మన కద్వైతమ్మె ముమ్మాటికిన్. 65

ఓ గృహిణీ మణీ! మన మహోదయ సిద్ధికి బ్రహ్మచర్యపున్
బాగెము కూడ బెట్టవలె నైతిక సంపద ప్రాణమిత్రమా.
కౌగిటిలో పరాత్పర నిరూఢత మెక్కి పరస్పరమ్ముగా
రోగము లేని భోగములలో దులదూగుదమో తలోదరీ! 66

దిక్కరులన్ సృజింప వలె. ధీనిధులై మన విశ్వజీవికా
చిక్కణ రాజ్య పాలన సుశీల కుశీలవ సౌమ్య బుద్ధి పెం
పెక్కిన యెక్కవేంద్రుస సతీ! జనయిత్రివి కమ్ము. నెత్తిపై
కెక్కెను మోయ లేని భర మెంతయు యో సహధర్మ చారిణీ! 67

అర్ధాంగీ! నిను వీడ నెడ్డ మన యన్యోన్యమ్ము లక్షించి "స్వీ
యార్ధాంగమ్మున భార్య నుంచుకొని యెయ్యారాన నర్తించు కా
పర్ది ప్రేమ మ"టన్న కీర్తి వలె, నీ ప్రాణమ్మె నా జీవమా
వార్ధక్యమ్ములు లేని ప్రేమ లతికల్ వర్థిల్లు ప్రాణేశ్వరీ! 68

మన్మథుడు బంటుగా నీ
జన్మము ధన్యమ్ముగా నెసంగుమి. నీ వీ
ష న్మాత్ర వాని వశయై
తన్మయవై యుండరాదు. తరుణీ! రమణీ! 69

లౌకిక ప్రేమముననె అలౌకికమ్ము
ప్రేమ విశ్వజనీన మావిర్భవించు.
దొరలమైె దాని భుక్తితో తరగలించు
దము భవానీ" యని శివుండు ధన్యుఁ డయ్యె. 70

తారకుడు గుబ్బుపట్టి నిద్రను మునింగె
నో! యెటుల్ కల్వరించుచు నుండె నెటనొ;
ఈ ముహూర్తమ్ము గుర్తింప లేదేమొ గాని
పాపి కనులెట్లు శుభములు పంచు కొనుట. 71

అత్త యని లక్ష్మికి మామ యనుచు హరికి.
నైదుపది చేసి మ్రొక్కి రార్యయు గపర్ది.
శివుడు శివయును ఋషుల కాశీస్సు లిచ్చి
దరిసన మ్మిచ్చుటన్ సురల్ ముఱిసినారు. 72

ముక్కున నత్తుతో నొసటిబొట్టున గుంకుమ కింపు జంపు పెం
పెక్కిన డాలుతో తళతళించెడి చిక్కని చందమామమై
సెక్కసకెమ్ము లాడి జగడించు గటాక్షము జల్లుతోడ న
మ్మక్కగ గానిపించు జగదంబ కహో యని మ్రొక్కి రెల్లరున్. 73

గౌరీ మహాదేవి గర్భ ఫలమ్ముగా
షాణ్మాతురుని దివ్య జనన మయ్యె
పరమేశ్వరునితోడ పరశురాముని ప్రక్క
విద్యార్థియై ధను ర్విద్య గఱచె.
తన సహాధ్యాయుతో తగని పందెము వైచి
క్రౌంచాద్రి గొట్టి యోడించి మించె.
నిలువెత్తు పింఛమ్ము వెలయ నర్తించు శు
కాపాంగ మొకడు వాహనము కుదిరె.
ప్రజల విఘ్నాల్ పటాపంచ లౌట
నన్నగాగ ద్వైమాతురుగాంచె తల్లి
దేవతల పౌఁజు మూస్టీనిగా వరింప
తారకాసుర విజయమ్మై ధన్యుఁడయ్యె
హరి హర బ్రహ్మ లగ్గించి ఆమతింప
జగమునకు నిందు చేసి ప్రశస్తి గాంచె. 74

అఘటన ఘటనా చణమును
నఘ హననోపజ్ఞ భావహావము మాయా
విఘటిత సర్వము క్రవ్యా
"జ్జిఘాంసు వగు నాది దంపతిత్వము నెంతున్. 75

లలతాంర సువర్చతా ప్రియ
లలనా లాలిత విలాస లలితాస్యా!
కలి కలుష లులిత లతికా
గళ లూన లలిత్రకే షు కావ్యే స్మిన్. 76



శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాల. రాజమండ్రి.

# తప్పొప్పుల పట్టిక

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 3 | సునాశీరు | సునాసీరు |
| 4 | షై | ష్టై |
| 5 | గల | గ |
| 17 | రేచిలేప | కతిలపఉంప |
| 7 | ఘగ ఘగ లాడెడి | తథావికస్వర |
| 5 | ప్రష్ట | ప్రష్ట |
| 3 | సృష్ణి | సృష్టి |
| 18 | సుషఘన్ | సుషమన్ |
| 12 | మండము | మండలు |
| 8 | రక్కసుడు | నేడు |
| 19 | ప్రగడ | పడగ |
| 5 | ద్రుంప | దుంప |
| 10 | స్వని | స్వలె |
| 16 | పిదిం | తుష్టిం |
| 20 | క్షుదా | క్షుధా |
| 20 | మాపక | నాశక |
| 24 | ము | ముం |
| 25 | ద్దీ | దీ |
| 3 | రమ్మో | రమ్మో |
| 6 | రెందరిన్ | చేరెందరిన్ |
| 15 | నీముందు | నీముందురం |
| 17 | ంనాకు | నాకు |
| 17 | మండలునిన్ | మండలుని నిన్ |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 25 | 24 | ప్రమోయు | మోయు |
| 26 | 17 | కేగిర | వేగిర |
| ,, | 24 | యామరు | యీమరు |
| 27 | 2 | మథ | మర |
| ,, | 14 | పాదతాడనమే | పదమ్మునఁ దాపులే |
| 28 | 5 | సంతి | సంత |
| 29 | 19 | లాగన్ | లాగున్ |
| 32 | 4 | వెన్ను | చెన్ను |
| ,, | 12 | నివి | టివి |
| ,, | 22 | వడతింన్ | వడలింపన్ |
| 35 | 22 | హ్యా | వ్యా |
| 36 | 7 | ంబొంచి | ంగుంచి |
| 37 | 14 | మందు | మండ |
| 38 | 3 | మంటి | మంట |
| 39 | 7 | భావునకు | భావుకునకు |
| 40 | 22 | చెదర | చెదరకే |
| 41 | 20 | మ్మ | మ్మ |
| ,, | 25 | ప్రౌఢ | ప్రౌఢ |
| 43 | 13 | తోడ | తోడ |
| ,, | 15 | తుల్ | తువే |
| 48 | 16 | నుచ్చింప | నుబ్బింప |
| 49 | 9 | యిట్టి | యట్టి |
| ,, | 14 | నై | నా |
| 50 | 3 | భప | భవ |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 50 | 8 | వాంత్వ | వాత్వ |
| ,, | 25 | మారి | మారిన |
| 51 | 3 | గామొటా | గాగమొఱ |
| ,, | 22 | మిడిన | మిమిడిన |
| 52 | 5 | ము | మ్ము |
| 53 | 20 | మానన | మానస |
| 54 | 11 | మె | మై |
| 55 | 3 | అంచు | అనగ |
| ,, | 19 | మ్ముశ | ము |
| ,, | 20 | ఓ | హో |
| ,, | 15 | పృధా | వృధా |
| 56 | 19 | కినలయ | కిసలయ |
| 57 | 8 | లీలాదితహాలా | లీ లా జఘ హా లా |
| 58 | 11 | శంశరు | శంకరు |
| 59 | 18 | మైకాగ్య త్వము | మైకాగ్య మ్మనం |
| 60 | 23 | దగ్గ | నవ్య |
| 70 | 3 | మ్మెన్వరు | మ్మెవ్వరు |
| ,, | 5 | పుంబుం | పుచుం |
| 71 | 11 | చో్ఛ | శ్చో |
| ,, | 22 | దైత్ర | దైవ |
| 72 | 8 | యోంజో | యోచో |
| ,, | 17 | ర్భ | ర్బ |
| 73 | 11 | వెంటనే | వెంటనే |
| ,, | 16 | నేల | వేల |
| 74 | 2 | గోరి | గౌరి |
| ,, | 16 | యామె | యూమె |
| ,, | 19 | నెప్పు | కెప్పు |
| 74 | 24 | భళ | భళి |
| 75 | 12 | దామము | రామము |
| ,, | 17 | ణా | ణవ |
| ,, | 23 | నావ | నాము |
| ,, | 24 | మెంత | మెంత |
| 76 | 3 | సేతుమె | సేతులె |
| ,, | 5 | దెటింగిన | దటింగిన |
| ,, | 23 | సాధు | నాదు |
| 77 | 23 | నియ్యోద | నియ్యోడ |
| ,, | 18 | ముద | మున |
| ,, | 24 | లై | కై |
| 78 | 7 | కొని | కొన |
| ,, | 9 | టాంళ | టాకళ |
| ,, | 19 | తాప | పాక |
| ,, | 26 | డేవు | దేవు |
| 79 | 13 | వెలయు | మెఱయు |
| ,, | 15 | బుగులు | బుధులు |
| ,, | 16to 23 | ఈ 8 పంక్తులున్ను 84 వ పేజీలోని గీతము కలిపి 83 వ పేజీలో 114 వ పద్యముగా చదువవలెను. | |
| ,, | 24 | వైచితి | వైచిత్రి |
| 81 | 6 | చుబో | చుబో |
| , | 8 | కాతింపవై | కాంతింపపై |
| 82 | 6 | నేనన్నా | ఎనన్నా |
| ,, | 8 | నీముల్ | వీనుల్ |
| ,, | 8 | బిచ్చమ్మకై | బిచ్చానకై |
| ,, | 23 | టు | యూ |
| ,, | 28 | మటికి | ముతికి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 83 | 9 | ఁబదునిన్ | ఁబడ |
| ,, | 17 | రాథిక | రాధిక" |
| ,, | 18 | కనుక | కినుక |
| ,, | 20 | బిచ్చగు | చిచ్చగు |
| ,, | 22 | తెడంగా | వెడంగా |
| ,, | 28 | బడెడె | బడెడి |
| ,, | 10to 13 | ఇందలి 114 వ పద్యము 84 వ పేజీలో 120 వ పద్యముగా చదువవలెను. (ఇది ఇచ్చటిదికాదు) | |
| 84 | 10 | తా | త్వా |
| ,, | 12 | లాభముల్ | లాంఛనల్ |
| ,, | 13 | రెచ్చించ | వెచ్చింప |
| ,, | 25 | టుట్లు | టెట్లు |
| ,, | 10to 13 | ఈ 120 వ పద్యము 79 వ పేజీలోని రెండవ సీసకు చేర్చి 83 పేజీలో 114 పద్యముగాచదువవలెను. | |
| 85 | 14 | యధా | యాధా |
| 86 | 10 | ఓసీ ! | ఓసి ! |
| ,, | 7 | ముశఁ | మునఁ |
| ,, | 25 | యే | మే |
| 88 | 20 | దోషములు | దోషముల |
| ,, | 20 | వో | ఘో |
| ,, | 22 | విధా | నిధా |
| ,, | 25 | నమ | సమ |
| 95 | 2 | లైన | వైన |
| 99 | 4 | సైక్యత | నైక్యము |
| ,, | 3 | ద షె | దు లె |
| 99 | 3 | ది | వి |
| ,, | 11 | శిషణ | శిక్షణ |
| ,, | 11 | తలన్ | తల్ |
| 99 | 25 | రింభో | రింఫో |
| 100 | 23 | ఓంద | ఓత |
| 102 | 16 | భవళాశా | భవదాశా |
| 102 | 11 | ష్టె | ష్టై |
| 102 | 20 | సునుగాను | సునుగా |
| 103 | 10 | మైభ | మైత్ర |
| 104 | 7 | మోత్కుశు | మోక్షేశు |
| 105 | 5 | ణ్యముల్ | ణ్యల్ |
| 106 | 15 | సేనంపు | నేనంపు |
| 109 | 20 | నేవ | సేవ |
| 118 | 3 | ద్ద్వ్య | ద్ధ్వ్య |
| ,, | 7 | వీస | వీన |
| ,, | 19 | యింబును | యంచును |
| ,, | 24 | క్వపయా | కృపయా |
| 114 | 12 | తోత్ | తోతే |
| ,, | 23 | నల్గుని | నల్లుని |
| ,, | 23 | ట్టం | ట్టఁ |
| ,, | 24 | మూడన | మూడ |
| ,, | 24 | లన్ | లల్ |
| 115 | 14 | గుభూ | గుభా |
| ,, | 18 | దను | దము |
| ,, | 21 | జాడు"బో" | "జాడఁ బో" |
| ,, | 22 | ద్య | ద్యఘణితి వే |
| ,, | 23 | సాదు | నారు |
| 116 | 12 | కాన | గాన |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 116 | 10 | బా | బ్రా |
| ,, | 17 | ముఖారి | వరాళి |
| 117 | 4 | పాఁది | పాఁడి |
| ,, | 25 | యురుడు | యుముడు |
| 118 | 4 | కేటి | తేటి |
| ,, | 4 | నేటెంచి | నేటించి |
| ,, | 7 | డోఁచున్ | జాఁచున్ |
| ,, | 9 | వేళం | వేళలం |
| ,, | 13 | లే | లేచి |
| ,, | 19 | డన | దన |
| 119 | 3 | పదార్థ్యనీన | పురాణశస్త్ర |
| ,, | 4 | దువలై | దువవై |
| ,, | 8 | మువ | మున |
| ,, | 12 | మయ | మయి |
| ,, | 13 | నాయక | నాయిక |
| ,, | 18 | నవ్య | నవో |
| ,, | 23 | మొకాౢ | మొక్కౢ |
| 120 | 3 | దురాళ | రుదురాళ |
| ,, | 5 | ముక్త నిన్ను | ముక్తినిమ్ము |
| ,, | 6 | లొ | లా |
| ,, | 7 | సేసలు | సేసఁబ్రాలు |
| ,, | 9 | జానుత | జామాత |
| 120 | 13 | సుమా | నుమా |
| ,, | 14 | దాదియు | దావియు |
| ,, | 14 | యా | యీ |
| ,, | 20 | మందునో | మీఁదునో |
| ,, | 21 | కొఁడుడు | కొఁడుక" |
| ,, | 25 | ప్రజల | ప్రజ |
| 121 | 20 | యణుల | యముల |
| 122 | 8 | వేంద్రుడు | శేంద్రుడు |
| ,, | 9 | మెంతయు | మెంతయో |
| ,, | 10 | ప్ట | పుట |
| ,, | 19 | విజ్వ | విశ్వ |
| 123 | 2 | లక్ష్మికి | లక్ష్మికిని |
| ,, | 6 | కింపు | కెంపు |
| ,, | 13 | గచె | గఱచె |
| ,, | 17 | కాపాంగ | క్లాపాంగ |
| ,, | 18 | లౌట | లౌనట్లన్న |
| ,, | 19 | నన్న గాగ | గాగ |
| ,, | 21 | యు | యి |
| ,, | 23 | నిందు | విందు |
| ,, | 27 | "జ | జ్జ |
| ,, | | వగునాదిదంపతి త్వముసెంతున్ | వొఁకదంపతీద్వ జీవితమెంతున్ |
| 124 | 2 | ర్ఛతా | ర్ఛలా |
| ,, | 5 | లవిత్రకే | లవిత్రకే |